# హాఁడేవీఁడు.

## మొదటి ప్రకరణము.

### రోగముగుదురుట.

ఈపురుషుఁడు దాదా పిరువదియొనిమిదివత్సరములవాఁడు. మీసములు దట్టముగానుండి నవనాగరికులకు వలసినట్టివంకరలన్నియుఁ దిరిగి యాతనిగుండ్రనిమోమున కందము గలుగఁజేయుచుండెను. తాను మంచిసత్త్వశరీరియు, స్వతస్సిద్ధముగా సందగాఁడును, సహజధైర్యవంతుఁడునగుట తన నావికునిమాటల వినక మామిడితోఁటమధ్యనున్న మార్గమునంబడి, యాస్త్రీవెంట త్వరగమనుఁడై చనుచుండెను. నావికుఁడు నావలోనే వీరిరాకకు సందేహముతో నాగియుండెను.

ఈమామిడితోఁట మిగుల దట్టముగను, భయంకరముగను నుండెను. చిన్నయడవివంటి యాపెద్దతోఁటలోఁ గేవలము జంతుభయములేకున్నను తేళ్ళు, జెఱ్ఱులు మొదలగువానిభయ ముమాత్రము లేకపోలేదు. యంత్రపుబొమ్మవలె మాటలాడక నిటునటుఁ ద్రోవనైనఁదప్పక, యామెవెంటనంటి చాలదూరము పోయిపోయి, కొంతసేపటి కీతఁడు నిద్దురమేల్కాంచినవానివలె నామెను బిలిచి, "ఎంతదూర మిటులబోవలెను. నిర్జనప్రదేశమగు

నీస్థలమున మన కెంతయు భయముగలుగవలసినదే. ఇట్టి దారుణారణ్యమార్గమున ప్రస్తుతము మీవెంట రాగలుగుచున్నానే కాని, తరువాత నేను మరలివచ్చుటలో నాకు తోడెవ్వరని భయముజెందుచున్నాను." అనెను.

స్త్రీ—నీవు భయపడనక్కరలేదు. మరికొంచముదూరము పోతిమేని మంచిమార్గము కానవచ్చును. ఆమార్గమున మరికొంచము దూరము పోతిమేని యిల్లుచేరగలుగుదుము. కావున తాము విసుకుకొందకుఁడు. ఇంతశ్రమ మీ కిచ్చినందుకు క్షమింపుఁడు.

ఆమెయొయనిమాటలచే బ్రాహ్మణుఁడు, "తకరారు లేదు. అలాగుననే కానిండు. తిరిగివచ్చుమార్గము నాలోచించుచున్నానే కాని మరేమియు లేదు." అనెను.

"మరలిపోవుటలో మీ కెంతమాత్రము నిబ్బందియుండదు. త్వరగా మనము యింటికిపోవుటకు కొంచము కష్టమునను, యీమార్గమును జెప్పుచున్నానేగాని, యిదికాక యింకొక మార్గము కొంచెముదూరముగా నున్నది. అయినను ఆరాత్రివను మిమ్ములను ప్రొద్దుగడలో తోడిచ్చి పంపగలను."

"సరే ఆలాగునే కానిండు."

"మంచిదబ్బాయీ! క్షమించండి, మీకు చాలావరకు శ్రమయిచ్చుచున్నాను. నన్ను రక్షించువారు మీరుకాక ఇంకెవరు. ఇట్టిఆపత్సమయమున మీరిక్కడకు రాకుండినయెడల నాకింకెవరుదిక్కు! నేను మీకు ప్రత్యుపకారము సేయుటకెన్నను నాచేతిలో లేదు.

ఇట్లు వారిరువురును నడచినడచి తుదకొక చిన్నమామిడితోఁట సమీపించిరి. ఆతోఁటమధ్య నొక రాజభవనము గలదు. ఈభవనమునకు ముందు వలయాకారముగానుండిన పలువలురంగుల పూలచెట్లయందము వర్ణనాతీతము. ఆస్త్రీ తోఁటనుసమీపించి, ప్రవేశించి, లోపలిభవనసోపానముల నెక్కి చావడిపై నిలిచి, "ఈతలుపు తెరచియేయున్నది. లోపల నెవరో యున్నారు. వారుండినతలుపు తెరచియేయుండును. రోగులం దనను నిద్రించుచున్నవారలున్నది." అనుచు నాసుందరి తలుపుఁద్రోసెను. అప్పటుల నే యాతలుపు 'బక్' అనుధ్వనితోఁ దెఱువఁబడెను. ఆలోపలిచావడియం దొకమూల మిణుకుమిణుకుమను నొకచిన్నదీప మారిపోవుస్థితిగా నుండెను. ఆస్త్రీ యాతలుపు దెఱచుటలోఁ దన సిగముపై నున్న ముసుఁగు వెనుకకు జారిపోవ, నాగుమ్మముకడ నిలిచియుండిన యువపురుషుని కామోమోము, షోడశకళాపరిపూర్ణమై, త్రిజగన్మోహనమై, మెఱుపుమెఱసినటులయ్యెను. తక్షణమే యామెయు మగుడ ముసుఁగిడి, ముసుఁగిడునెపమునునో, కాక యాదీపము నాఘాతముమినో గాని దీపముమాత్ర మారిపోయినది.

తక్షణమే యామెయుఁ ద్వరితగతి నడుచుచుండెను. ఆమె కాలిచప్పుడువిని, యాధ్వని ననుసరించి, యాపురుషుఁడు నడువ వలసినదేగాని, యామె కానవచ్చుటకయినను దగినంతమాత్రము వెలుఁగేలేకయుండెను. ఆస్త్రీ వెంటఁబడిన యాతఁడును గొంత దవ్వరిగి, "మీరు లోనికివెళ్లి యాయన యేస్థితిలోనున్నారో దెలియఁజేయువరకు నేనిచటనే యుందును." అనుచు నటనాగెను.

"లేదు బాబూ. మీరున్నా లోపలికిరండి. నేను లోపలికిబోయి తిరుగ వచ్చువరకు వేళ చాలయగును. మీరిట నొక్క రెంతసేపనియుందురు. కావున మీరును నావెంట దయ చేయుఁడు" అనుచు నామె ముందునడువ వెనుక నితఁడును, గాఢాంధకారమున నడుచుచుఁ బోవుచుండెను. వీరిరువురును మొదటిచావడిదాఁటి, రెండవచావడిని బ్రవేశించిరి. ఆచావడి యందును దీపముండలేదు. గడ్డి మొదలగువానిచే నిచావడి నిం పఁబడియుండెను.

ఇరువురును నాచావడింగూడ దాఁటిరి. అనంతరము మూఁడవచావడియుఁ జాలవఱకు మలినముగానే యుండెను. ఈ గదికి నుత్తరభాగమున సోపానములుండెను.

"మీరిచ్చటనే యుండుఁడు. నేను మెట్లెక్కి మేడమీ దనున్నదీపము దెచ్చి మిమ్ముఁగూడ మేడమీఁదకు దీసుకపోవుదును దయచేసి మీరిచ్చటనే యుండుఁడు" అనుచు నామె మెట్లెక్కు చుండెను. పురుషుఁడును నట్లేయని యాచీఁకటిగదిలో నసహా యుఁడై యామెపోవుదిక్కునే కాలిచప్పుడు ననుసరించి పరికిం చుచు నిలిచియుండెను. ఆగదిలో వెలుతురు లేకుండుట యటుం డ, గబ్బిలములకంపు, నెలుకలయల్లరులు మిక్కుటముగానుం డెను. కావున నాదుర్వాసనాప్రాబల్యముచే నితఁ డూపిరిదీయు టకయిన మిక్కిలి యనవకాశముగాఁదలఁచి బయలునకుఁ బోఁద లఁచి, మొదట నేదేని కిటికీకలదేమో యని గోడనంటియుఁ ద నకందినంతదనుక వెదకిచూడ నొకవైపు మూయఁబడియున్న కిటికీతలుపు తనచేతికిఁ దగులఁగానే యాతలుపును దీయఁబ్రయ

త్నించి, యది రాకుంటఁగాంచి, మఱికొంచెము పరిశోధించి, తు
ద కాకిటికితలుపు బయటనే గడియవేసి యుండుట గ్రహించి, యటనే నిలిచి, యనవసరమగు నాయాసము పాలుకాఁజాలక, బయలుసకుఁబోవ వెనుకకుఁదిరిగి నాలుగంజలువేయునరికి, మెట్ల మీఁదనుండి వెనుకకు చిన్నవెలుతురు గానవచ్చెను. తక్షణమే తానచ్చటనే నిలచి, వెనుకకుఁ దిరిగి చూచెను. అప్పుడా స్త్రీ సిరముపైనుండియున్న ముసుఁగుతో, చేత నొకచిన్న వెలుతురుగల లాంతరుదీపముతో మరలివచ్చుచుండెను.

"అయ్యా! తాము వేగముగా దయచేయవలెను. నే నెంతభయపడుచున్నానో అంతయు నైనది. ఎంతసేపైనదో మూర్ఛవచ్చి కాని, చాలా గాఢముగా నేయున్నది. ఒంటిమీద నావంతయు దెలివి లేదు. ఇంకేమి చేతును. త్వరగా దయచేయుడు" అనుచు నామె దీపము వెనుకకుఁజూపుచు, బిరబిర మేడ మెట్లెక్కుచుండ, నతఁడును, "ఔఁ అట్లనా" అనుచు నామె వెనుకనే మేడనెక్కెను.

లోపల నొకమంచముపై నొకఁడు కదలక మెదలక నా పాదమస్తకము నొకదుప్పటిఁగప్పుకొని పరుండియుండెను. ఈరోగి పరుపుమీఁద దుప్పటి లేదు. తలగడ క్రిందపడియుండెను. ఈగదిలో సన్ననికొవ్వువత్తి కాలుచుండెను. ఈరోగి ప్రాయమునసలుస దిపంటలవాఁడై యుండును. దృఢశరీరుఁడు. శరీరారోగ్యమునకు లోపములేదు. ఇట్టిపురుషునిఁజూచి "మీరేనా యిప్పుడు నేను చూడవలసినవారు." అని యడిగెను.

"ఔను బాబూ. రక్షించండి, రక్షించండి"

"ఫర్వాలేదు. తొందరపడకండి. నేను వీరినాడి పరీక్ష చేసి మరీచెప్తాను" అని నాడిబరీక్షించి, మరలఁబరీక్షించి, "ఇది యేమి! చిత్రమూ! మోసమూ!" అని యనుకొని యంతతోఁ దృప్తినొందక, మరలఁబరీక్షించి, చూచి, చిరునవ్వునవ్వి, యీ రోగినిగూర్చి సంశయము పూర్తిగాఁ గలిగినకాఁబోలు, "యేదో పన్నుగడమీద నన్నిక్కడికీ స్త్రీ తీసుకవచ్చినది. కాకున్న ప్రపంచములో నింతవింతరోగ మీతనికే తొలుదొలుతకలుగవేల" అనియనుకొని మిన్నకుండెను.

స్త్రీ భ్రమనొందినదానివలె, "బాబుగారూ! చేతినాడి చూచినారుకదా! ఎట్లులనున్నది?"

పు—నాడిలో నేరోగమున్నూ లేదు. ఇతని కేరోగమును లేదు.

స్త్రీ—డాక్టరులందరును మీలాగేచెప్పినారు.

పు—ఎట్లాగు?

స్త్రీ—నాడిలో రోగములేదని.

పు—సరేకాని. ఆదీపము మీరిట్లాగు తీసుకరండి.

స్త్రీ—దీపమెందుకు రోగివద్దకు?

పు—నాడివలన రోగము తెలియనప్పుడు, కండ్లనుతెరిచి చూడవలసియుంటుంది.

ఇంతలో నామె సంశయముతో దీపమును దగ్గఱకుఁ దీసికొనివచ్చెను. ఆవెలుతురులో నీతఁడా రోగికనుబొమ లెత్తి లోపలికనుపాపలు బాగుండుటయు, రెప్పలలో రక్తము పూర్తిగానుండుటయుఁ, జూచి, "యీడిగుల్ల్యాజీతన మేమిటో

చూడవలెను." అనియనుకొని కనురెప్ప లెత్తియేయున్నాఁడుగ నుక, తనవ్రేలితో, నాతనిలోపలిగ్రుడ్డు నంటుసరికి దట్టుక్కున రోగి కనురెప్పలు మూసివేసెను. తక్షణమే, తనకదివఱకే కలిగి యున్న సంశయము వృద్ధియై, "యేమియాంతకము చేయనున్నా రోకదా యీయీలుమగలు." అని యనుకొని, యాలోచించు చుండెను.

స్త్రీ—"బాబూ! యేమి మీరే సంశయించుచున్నారు? కొనకు జీవితాశకలదా లేదా? అని వేడికోలుగాఁ బలికెను.

"మీరెంతమాత్రమును జంకనక్కరలేదు. నమమిప్పు డొకపనిచేయవలెను. మీరు చెంబుతో కొంచమునీళ్లు తీసుకొ రండి. నీళ్లు మొగముమీద జల్లి కొంతసేపు చల్లగా విసరుచుం డిననో నింకేమగునో ముందుముందు కనిపెట్టుదము."

తక్షణమే బుగ్రనాపుడు నామె యింకొకగదిలోనికి వెళ్లెను, ఆస్త్రీ నీరు తేలోనికరిగిన క్షుద్రాదారునిమిషములకేగా. "హా! హా, హా, హా యనుచు నఱచుచు, స్వప్నావస్థ దాఁటినపిదప నిద్రలేచి దిగ్భ్రమజెందువానివలె నట్టిట్టులు కల యఁజూచి, తనయెదుట నున్నవానిని బరికించి, "తమరెవరు? తమపేరేమి?" అని యడుగ నాతఁడు "నాపేరు దేవేంద్రమి త్రుఁ డనియందురు. నేను పోలీసుసబ్ యినస్పెక్టరును"

"ఏమిది! ఈపేరు నేనెన్నఁడును విన లేదే?" "ఎట్లు లవిందురు? నానివాస మిచ్చటకాదు. కలకత్తాను దక్షిణమున నున్న భవానీపూర్"

"సరేకాని మీరిచ్చట కేలవచ్చిరి? మిమ్ముల నెవరుతీసుకవచ్చిరి?"

"వైద్యులకొఱకు వెదకుచుండిన తమయిల్లాలిని చూచి, దారితప్పిపోవునను భయమువిూద నన్ను కోరినందున నేను నాయము రాగా, మీదేహస్థితి, రోగచరిత్రయంతయు చెప్పగా, వినివిని నేను వైద్యమెరుగుదును గనుక నేనే వచ్చితిని.

"నాదేహస్థితి, నారోగము, నాకథయంతయు నాస్త్రీ మీతో చెప్పెనా?"

"ఔను చెప్పెను. కనుకనే నేనిక్కడకు వచ్చితిని. కానివో నేను మిమ్ములచూడనేల?"

"నాకు డాక్టరులమీద నమ్మకములేదని, ఆస్త్రీ చెప్పలేదా?"

"ఔను మాటలసందున మఱచితిని. ఆమె నాతో చెప్పెను."

"అయితే తెలిసిన్ని యేలవచ్చినారు? చాలశ్రమపుచ్చుకొని వచ్చినారే. ఎంతో పని యుంటిని. అనవసరములేనిపని మీకాస్త్రీకల్పించినది."

"సరే మీరు స్పృహతప్పియున్నారు కనుక వచ్చితిని. ఇపుడు మీరు యీలోకమునకు తిరిగివచ్చినారుగనుక యిక నేను సెలవు పుచ్చుకొందును." అనుచు నీతడు లేచినిలిచెను.

రోగి—అయ్యా క్షమింపుడు. డాక్టర్లువచ్చినపిదప నొకతూరి నాడిపరీక్షచేయించుకొని వదలివేయుట మంచిదని తలంచుచున్నాను.

స్త్రీ—“ మీదయయున్నంతకాలము మీపనులు సరిగానే యగుచుండును. ఇప్పు డేమి సెలవు?”

సెలవుకేమున్నది. త్వరగా పనికానిచ్చి యాసుభవార్త నాకు తక్షణమే తెలియజేయవలెను.

ఈమె వెంటనే బయటికివచ్చి, “ మీతో కొంచెము మాటలాడవలయును. దయచేయుడు ” అనుచు దేవేంద్రునితో నేకొకగదిలోనికిఁబోయి కొంచెకతడవు మిన్నకుండి, “తమరు నన్నెన్నడు నెఱిఁగియుండలేదు. నేనును తమ్ము నిదివరకెన్నడును యెఱుఁగను. మీరు పరపురుషులు. అందుచేత సౌందర్యవంతులు. నేనును పరస్త్రీనే. ఏదో నాకును, దేవుఁడిచ్చిన రూప మింతో యెంతో కలదుకదా! అని యేమేమియో ప్రశ్నల నడుగుచు, దన మందస్మితవదనారవిందము నొకవింతసౌందర్యాగ్రముతోఁ దిప్పుచుఁ బైటకొంగు నొకించుక సవరించుకొనుచు, నిండీసకచభారము వీడఁ, దన మేలిముసుంగును సరిసేసికొనుటలో నామె పఱపిన మోహనదృష్టులయొక్క ప్రభావ మెఱుఁగనివాఁ డెవ్వఁడు?

అసుందరి యాపురుషునడిగినప్రశ్న లెట్టివి? ఇందుకాతఁ డెట్టి ప్రత్యుత్తర మీయఁగలఁడు? సహజసుశీలుఁడగుటచేత, “అయ్యో! ఉపకారమునకు వెంటనే అపకారమనునది నిక్కమైనది. ఇదియొక సంసారియింటి దనుకొంటినేగాని యిప్పటిసంగతిచూడ దీనిచరిత్ర మంచిదికాదు. ఇది యొకదయ్యమనుకొనవలసినదే అయ్యయ్యో! నేనేకార్యముకొఱకు నిలువెడలితిని. హా రేవతీ, నీ వెట్టికష్టముల నందుచున్నదానవో కదా. నీవిషయ మెట్లుండ అరిందమచే

పంపబడినదే సిరిష్కృత దగులుకొంటివి. అక్కటకటా, పోనిచోటుల కేగితిని, కనరానిచోటుల గాంచినాఁడ, కాని నిజాడయ్యూవంతియు గానరాదే హా! సర్వేశ్వరా" అని మనమునననుకొనెను.

అంత నా [illegible]—"మీరు నా మాటలకు మనసునకొప్పించకపోవరు! కాని యిందునాతప్పు మియు లేదు. స్త్రీజాతిహృదయము లాంటులనే దుర్గుణములయ్యు ననివార్యములై యుండును. మీరు నన్ను సిగ్గుమాలినదానినిగా భావింతురు. నేనేమి చేయగలను. నామనసు నాస్వాధీనములో లేదు. నానాలుక నేనుచెప్పినటుల వినుటలేదు. నేనెంతమార్చుకొనినను మీరు నామనసునెఱిఁగి నన్ను మన్నించకున్నారు. 'తనంత దానవచ్చిన కాంత మొల్లనన్న నోరులకు చుల్కన' యను నదినిజము ఈకారణముననే మొదటినుండియు నేను చెప్పదాఁచ నిపించుకొనుచున్నాను. మీరైననాకనిగానెంచక నన్ను మన్నించవలెను." అనుటచేత దేవేంద్రబాబు మనసు మరింత చెదరి పోవుచుండెను. ఆసుందరి యొక పెట్టెనుండి, యందుంచిన, యంజూరి, ఖర్జూరి, కమలా, నారింజ, ద్రాక్షలోనగుపండ్లను, బాదము, చార, అక్రూట్లు, జీడి, వేరుశెనగ మొదలగు పప్పులు పైకిదీసి యొక వెండిపళ్లెరమున నునిచి, దేవేంద్రవిజయునింగూడఁ దినుమని బలవంతముచేసెనేగాని దేవేంద్రవిజయుఁ డేమియు నే యక మిన్నకుండెను. ఆసుందరి దేవేంద్రవిజయుని జూచుచు మాటిమాటికిఁ బయ్యెదసవరించుకొనుచుఁ, దనమెడనున్న యలంకారములఁ బలుమారు సరిచేసికొనుచు, మోహనదృష్టులఁ

బరపు మండెనేగాని, యాతనిహృదయమునకుమాత్ర మేమియు నుపయోగము లేకుండెను. క్రొంచముతడవాగి దుర్వారమైన కామేచ్ఛను వెలునఱుప, నచ్చటనున్న యంజూరపండ్లగుత్తిలోనుండి నొకపండునుదీసి దేవేంద్రబాబునోటికందియ్యఁబోయెను. సుశీలుఁడగు నాపురుషుని కీర్తియనుచితమైనట్టియు, నభావ్యమైనట్టియు, నమానుషమైనట్టియు, కార్యమున కొడలెల్లఁ గోపాగ్నిచే, గనులనెంబడి నాయగ్నిశిఖలు బయల్వెడలుచుండెనన నితనికనుల కెంపురంగు ప్రజ్వలించుచుండెను. కాని దుర్నివారాగ్నేయకారణమున నాయమానుషకార్యమునకు విస్మయముగలుగుటచే నాతఁడు మాటలాడనేరక, మిన్నకుండెను.

"అనుమాత్రమైనను పరిచయములేని పురుషునెదుట, నొక గృహస్థురాలిట్లు వ్యవహరించుట యెంతయు శోచనీయముగనున్నది. ఇదియంతయు మాయగనున్నది!" యని దేవేంద్రబాబు పలుకుచుండఁ దాలుగు నామె యంతద్వయంబంటి పాస్కు నుచు నెనుకకుఁద్రోసివైచి, తానును వెనుకకు తగ్గెను. తత్క్షణమే యామె తీవ్రపురుషికి, సిగ్గునకు యేమియునాయనబోక, దేవేంద్రునిజూచుచు "అమ్మా! మీరొకగృహస్థుభార్యగ నున్నారుగదా! నేను పరపురుషుఁడను. మీకిట్టియూహ పుట్టుట ధర్మము కాదు. నేనెక దౌర్బల్యమనుచు. మిమ్ముల నేను క్షమించవలసినదగును. మీరొకరికి నెరవేర్చని తప్పిదమునకు నన్నే మీరు క్షమించవలెను. దయచేసి నన్నొకని ఘమునిచ్చి నాయింటికిఁ బంపివేయఁగోరుచున్నాను." అనెను. తత్క్షణమే యామె యాతనిఁజూడ నామెముఖమున నెట్టిలజ్జాచిహ్నమైనఁ గానరాలేదు. సంశయభా

వ మిసుమంతయైన నుండలేదు. ఆమె దేవేంద్రవిజయునెదుట ని లిచి బహువిధముల శృంగారరసము చిప్పిలఁ బలుకుచుండె.

ఆమాటలు వినినతోడనే దేవేంద్రవిజయునిరక్త ముఖము కెంజొచ్చెను. కోపముచేఁ గనులకరుణిమ వచ్చెను. ఒడలు వణఁకఁ జొచ్చెను. "ఇట్టియనుచితకార్యములు చేయుటకు దేవేంద్రబాబు బుద్ధిహీనుఁడు కాఁడు. పోపొమ్ము." అనుచుఁ గడునిగ్గి లాగానెను. అంతనామె "నన్నుకరుణించి యాదరించకయున్న నికదిక్కెవ్వరు." అనుచుఁ బాదములపైఁ గొరగెను. అతఁడు తప్పించుకొని, ప్రయత్నించి, తలుపునొద్దకుఁబోయి తలుపులాగిచూడ మీఁదిగడి యవేసియుండెను. కావున నాతఁడటనిలిచి యామె కేదోకొంత యుపదేశము సేయఁబోవ నామె యాతనిమాటలువినక తనమొలనున్న గుప్తఖడ్గము నొరవెలికి దీసి యాతనిపాదములకడఁ బడవైచి, "నన్ను మన్నించి, నన్నాదరించి, నన్ను సంతోషపరచినసరే, కానిచో నిదిగో నాకత్తి యిదిగో నామెడ. నన్ను సునాయాస ముగ చంపివేయుము." అనుచు నమస్కరించి యాతనిచేతులు పట్టుకొనెను. దేవేంద్రవిజయుఁ డానుచేతులు విడిపించుకొని, "నన్నంటకుము పిశాచీ! మానవాకారమునున్న యోదయ్యమా దూరముగానుండుము. ఇట్టి దుర్వృత్తులు మానుము." అనుచుఁ దనచేయి విడలించుకొని దండతాడితభుజంగంబుభాతి దీర్ఘోచ్ఛ్వాసంబుజేసి తప్పించుకొని మరియొకమూలకేగెను.

మిమ్ములనే నేను ప్రేమించుచున్నాను. నన్నాదరింపుము. నన్నాదరింపుము." అనుచునామె బ్రతిమాలుకొనుచు నా

పగులఁగొట్టుచుండెను. మిక్కిలి బలమైన యాతలుపు నీత నికిలోఁగునా? వృథాశ్రమపడుటగాక యింకేమియు లాభము లేకపోయెను. కొంతసేపు తానుశ్రమపడియూరకుండి, గదిలో దుర్భరమయినదుర్వాసన గొట్టుచుండెను. ఎట్టులనో సహించుచు నూరకుండెను. కాని "ఔరా కాలమహిమ!! ఉపకారికి నిట్టుల నపకారము రాతగునదే" యనుకొనుచు నుండి యుండి తలుపును బగులఁగొట్టుటకు దన్నుచుండెను.

మరికొంతసేపటికి భరింపరానిపొగ యాగదిలోనికి వచ్చుచుండెను. అంతకుఁబూర్వమే దీపపుకాంతి తగ్గుచుండెను. ఇప్పుడు గదిలో పొగవ్యాప్తియైనకొలఁది దీపము మరింతతగ్గుచుండెను. దేవేంద్రవిజయుఁడు కూర్చిండి సలుపుచుండఁ, [illegible] కొని "స్త్రీరూపమునవచ్చిన పిశాచమిది. ఇది నన్ను చంపయత్నించి నన్నౌషధముచే దెచ్చి తనకోర్కె దీర్పుమియను[illegible]ము గనపర్చుచు నన్నిందుబెట్టి యిల్లుతగలబెట్టి యామార్గమున ననుజంపుచున్నది. కాని యింతతో సరి. నేనుపోవుచుండినపని నిర్మూలమై చెడిపోయినది. ఇంకేమిచేయుదును" అని యనుకొనుచు నింకొకనాటి యాపచ్చక్రతోఁ దలుపులఁ దన్నుచుండెను. పైనుండి యొకయెలుంగు వినఁబడెను. అదియేదియన, "ఏల వృథాయాసము. చావుసీకుతప్పదు. నన్నానందము నొందజేయుము. నన్నువరింపుము. నీకు సకలసౌఖ్యములు కలవు"

"ఛా- -ఆపిశాచమే—ఆదయ్యమే—కానిమ్ము చచ్చినచత్తుగాని నేనొడంబడను."

పోగయత్యధికమగుచున్నది. దేవేంద్రవిజయునకది బహుమన్వరమై యూపిరి తిరుగుటలేదు. గుండెలలో భారమధికమగుచున్నది. కన్నులు మండుచున్నవి. దేహము పొంగిపోవుచున్నది. తల తిప్పఁదొడంగెను. కాళ్ళలో బలము సన్నగిలుచున్నది. నాలుక తడియాఁగుచున్నది.

పాపము దేవేంద్రవిజయునకు జీవితాశ సన్నగిల్లఁజొచ్చెను. "చచ్చితిని—చచ్చితిని—ఎవ్వరును సాయముసేయరారా! రక్షింపుఁడు" అనియఱచుచు నేలవ్రాలెను. కొంచెముసేపటికి లేచి "అయ్యో!" యని పెద్దయుఱపుఱచి తిరుగ నేల వ్రాలెను. తిరుగలేచి నిలువనెంచె నేగాని బుద్ధిస్థిమితము లేదు. తెలుపుమబ్బులబుద్ధితో దారుపువలెపొంగిన దేహముతో నేలఁబడి తెలివితప్పుచుండినసమయమున, నొకయాజానుబాహుఁడు మిక్కిలి బలమైనవాఁడు, వలమైనగళముగలవాఁడు, విశాలమైన వక్షస్థలముగలవాఁడు, పెద్దకనుఁగవవాఁడు, అందమగు రూపము వాఁడు తటాలునఁ దలుపుఁదెఱచి లోనికరిగి పడియున్న దేవేంద్రవిజయునెత్తి, తనరొమ్మునాననుకొని పరుగిడెను. దేవేంద్రవిజయుఁడు తనగదిలోని కానూతనపురుషుఁడు వచ్చుటమాత్రము చూచెను. తరువాత దేవేంద్రబాబునకు తెలివిలేదు. కన్నులు మూఁతపడెను.



# వాఁడేవీఁడు.

## పదునెనిమిదవ ప్రకరణము.

### వారెవరు.

పక్షులు తెలివిగాంచెను. తూరుపుదిక్కరుణము వహించెను. సూర్యుఁ డుదయించెను. ఇండ్లమీఁదికి యెండ వచ్చుచుండెను. ఎండవేఁడిమియు నధికముగాఁ బెచ్చెను.

ఒకమామిడితోఁటలో నొక చినాలవృక్షముచెంత నొక మనిషి యప్పుడే నిద్రలేచి కన్నులునులిమికొనుచు లోఁతునకుఁ బోయినకన్నులతో, మిక్కిలిబడలిన దేహముతో, నిలిచి, "ఓహో! యేమివిచిత్రము. మరల నేను జన్మించినానని" యనుకొనుచు, నలువంకలఁ గలయఁజూచి, "ఈతోఁట అరిందమ్‌బాబుగారి యింటిదగ్గరదిగాదా! నేను తక్షణముపోయి నాదీనచరిత్ర నంతయు నాయనకు నివేదించవలెన"ని యనుకొని మెల్లమెల్లఁగ నడుగులిడుచు, నరిందమ్‌బాబుగారియింటికి బోయి, కచేరిచావడిలో నొకవార్తాపత్రికఁ జదువుచుండిన, యరిందమ్‌బాబుగారిని సమీపించి, నమస్కరింప, నాతండును, రెండునిమిషము లెగాదిగఁ జూచి, "ఓహో; మిత్తర్‌బాబుగారు!! ఇదేమిటి యీ వేషము. రేవతి కుశలముగనున్నదా? ఏమి! మీరు మిక్కిలి

# వాఁడేవీఁడు.

## పందొమ్మిదవ ప్రకరణము.

### ఏమిమాయ.

“అయితే మీకీయుత్తర మెక్కడదొరికినది?”

“అయ్యో! మీజేబులోనున్నయుత్తరము మీరే యెరుగలేకున్నారా?”

“నాజేబులోనుండెనా!”

“అవును మీరు స్నానముచేయుచుండగా మీకోటు జేబును వెదకితిని. అపుడది యందున్నది. కావున దీనిని చదివి చూడగా వింతవింతగానున్నది.”

“ఆహా! ఏమివింత!! నేను మతిలేక నొడలు తెలియక పడియున్నపుడామె యీయుత్తరము నాజేబులో నుంచెనుగాబోలు నాకేమియు నెరుకలేదు”

“ఉత్తరమంతయు పూర్తిగా చదివితిరా?”

“చదివినాను సంగతులకేమిగాని సంతకమెంతచాలక్కగా చేసినదో చూచినారా?”

“ఔను! అదే యాశ్చర్యము!!”

“మొదలునుండి తుదవరకును మిమ్ములను రమ్మనుమనియే కోరుచున్నది.

“ కావుననే మనమును పోవుచున్నాము”

“ జూలియా నన్ను గుర్తింపగలుగుటనుగూర్చియే నాకు నాశ్చర్యమగుచున్నది. ”

“ సరేకాని మిమ్ములను జూలియా యెటులగుర్తింపగలిగెను. మీరాత్రియను నిన్నరాత్రి పోయెదరని యెటుల దెలుసుకొనగలిగెను?”

“ ఏమీ! ఇంతింతవింతలు చేయగలిగినవాడికీసంగతి యొకలక్ష్యమా? ఇంతియగాక నిన్నసాయంకాలమున నేను తమతో నేవతిని వెదకబోవువిషయముగూర్చి ముచ్చటించుచుండ నొకమోటుమానిసి మాయింటికివచ్చి నన్నుగూర్చి “ మిత్రాబాబుగారోడకెప్పుడు బోయెదరు?” అని యడిగెనట. అందుకు, “ నేటిరాత్రి యెనిమిదిఘంటలకు బయలుదేరుచున్నారు” అను ప్రత్యుత్తరమును విని యాతండును వెడలెనట. నాకాయంశములు భోజనముసేయుచుండ నావంటవాడు చెప్పెను. ఎవరో నాస్నేహితులుగాబోలుననుకొని, నేనంతట. నూర్ పనిచేయుటకు పోవుచున్న కారణమున మరియావిషయములుగూర్చి ప్రశ్నించక బయలుదేరితిని. ఈ యడిగినవాడొకనేనా? మీరుచెప్పిన జూలియాసంబంధికుడేమో?”

“ ఓహో! ఇంతవ్యవహారమున్నదియేనా మీరింత మోసపోయినారు? వాడేగారె—వాడు ఫ్రాల్ నాహేలునకు కుడిచేయి.

సరే మీరాత్రియను బోవుచున్నారని తెలిసియుండిన చాలు—అందుమీద మీరొక పెద్దడాక్టర్లు—గనుక, రోగి—

వెంటాడించుచుండెను. అరీంద మలసిపోవుటచే నామె
ను బట్టుకొనఁజాలకుండెను. చూచినగదులు చూడలేదు.
నడిచినత్రోవల నడువలేదు. తుద కరీందమ్ తుపాకి
నెత్తి యామెను జంపఁదలంచియు, మరల, పట్టుకొన
లేక, తుపాకిచేఁ గాల్చి చంపినాఁడను, నపవాద మనంతర
మువచ్చునని యెంచికాఁబోలు, యెత్తినతుపాకిని దించి
యామెను వెంటాడుచుండెను. ఆమె వెనుకకుఁదిరిగి చూ
చుటలేదు. వీరిద్దరు సమానముగా నలసిపోయిరి. తు
దకాస్త్రీ యొకచిన్నగదిలోఁ బ్రవేశించి, తటాలున గ
దితలుపు మూసివేసి లోపల గడియవేసికొనెను. అరీం
దమ్ బయటనే యుండిపోయెను. "అన్నా" యని
యనుకొనుచు, నాతలుపును దనయావచ్ఛక్తిని గాలి
తోఁదన్నుచు, మిక్కిలి యాయాసమునొందినను పట్టువదల
విడువక తలుపును దన్నితన్ని, తుదకు తలుపునుదెఱచె
ను. లోపలిగడియ యూడిపోయెను.

"బాబూరే! బాబూ!! ఏమిచిత్రము—ఎక్కడకుపోయి
నదో? అరే!! మరెక్కడ ద్వారములేదే—" అని యాశ్చర్యప
డుచు నాగదినంతయుఁ బలుమారు వెదకి చూచుచుండెనే కాని
యందెందును ద్వారముకాని, గవాక్షముకాని కానరానందున,
నరీందము చేష్టలుదక్కి నిలిచియుండెను. కొంతతడవైన పిదప
నాగదిలో నామె యిఁకలేదని నిరాశఁజెంది, మరిరెండుగదులు
గూడ చూచెదనని యెంచి, పోవుచు, చూచుచు "లేదు,

ఎందుబోయెనో, ఇదిరాక్షసి—" యని యనుకొనుచు, నాభాగమునవున్న గదులన్నియుఁ జూచుచుండెను.

ఇంతలోఁ గొంతవఱకు సీతని వెంటవచ్చి, పిదపనాగియుండిన, దేవేంద్రమిత్ర రూపకుండ వేలనని యెంచి, తానును మఱిరెండుగదులను జూచెను. అందొకగదినుండి బయటకువచ్చుచుండిన యొకపురుషు నీబాబు చూచి, వచ్చుచున్న మహాకోపమును గొంతవఱకాఁపుకొని, పరిచయమున్నవానివలె, "ఓహో! బాగానున్నారా? దేహ మారోగ్యముగా నున్నదా?" యని కుశలప్రశ్న జేయ, "మీదయవలన, మీయాశీర్వాదప్రభావమువలన, నిటుల"నని ప్రత్యుత్తర మిచ్చి, "ఏదో పెద్దపని లేనిదే తమవంటిపెద్దలు రారే," యని యడిగెను.

"అదే చండాలుడా—నేనువచ్చినయాలోచన నిప్పుడే తెలుసుకొగలవు. నీకు బుద్ధిచెప్పి నిన్ను మంచిత్రోవలోకి దెచ్చుటకే వచ్చినాను."

"సరేకాని, నాకుబుద్ధిచెప్పుటకు మీరొక్కరేవచ్చినారా? యింకెవరు మీకుతోడురాలేదా? అరిందమ్‌బోస్ రాలేదా?

వెంటనే దేవేంద్రమిత్రక్, మిగులకుపితుండై, తనజేబులోనున్న చేతుపాకీ దీసి, యాపురుషుని గురిచూచుచు, "అరే! ఖబడ్దార్!! పారిపోతివేని యీపిస్తల్‌తో నిన్నినిముషమున జంపెదను. నిలచినస్థలమునుండి కదలితివా నీతలపెంకె గరగొట్టెదనుసుమా!" అనెను.

కదలకనిలిచి, "ఏమండో! దేవేంద్రవిజయబాబుగారు! ఫ్రాంక్‌సాహేబు పారుబోతుమనిషియనుకొంటిరా? యేమి? మీరునన్ను ఖైదుచేయుటకే వచ్చినట్లున్నది?"

"అవును"

"ఎప్పుడు"

"ఇప్పుడే"

నవ్వుచుం బూల్‌సాహేబు, "మీరట్టుల దలంచి వచ్చినారుగనుక, బేడీలతో సిద్ధముగానేవచ్చినారుకాబోలు? అయితే మీచేత బేడీలువేయించుకొనుటకు నేను కదలక, మెదలక, నిలచియుండవలెగాబోలు!"

"అవును. అట్టులనే,"

"అయితే మీరట్టుల చేయలేకపోయినప్పుడో?"

"పట్టి బేడీలువేయలేకపోతే దూరమున నిలిచి, నిన్ను తుపాకిచే గాల్చి చంపడమే!"

"అయితే మీయిష్టమువచ్చినట్టుల చేయుడు. ఇదిగో నేను మీస్వాధీనుడనే. క్లెన్మైక వెంబ్రికవాసి కదలను, మీరిచ్చటనుండి వచ్చి నాకు బేడీలువేసి ఠాణాకు గొనిపోయి ఫ్రాంక్‌సాహేబును పట్టితిమన్నకీర్తిం మీరే పొందుడు. అరింధమ్ చేతకానివాడు. పోలీసువారికల్ల మీరే ఘట్టివారు! మీయంత ప్రతిభావంతులును, శక్తిమంతులును, బుద్ధిమంతులును, యిక లేరు. చాలాసేపు మిమ్ములను నాకొరకు కనిపెట్టుకొనియుండనీయను. రండు త్వరగాపట్టుకొని బేడీలువేసి మీపని మీరు నెరవేర్చుకొనుడు," అనుచు రెండుగదులు వెనుకకుతగ్గి, తనగదిగు

మ్మముమీఁద నిలువఁబడ, దేవేంద్రబాబు తనజేబీలలోనున్న బేడీలను దీయుచు, రెండడుగులు ముందువేయునప్పటి కేదియో యొక పెద్దధ్వనియయ్యెను. దేవేంద్రవిజయుఁడు మాయయయ్యెను. మఱికానరాలేదు. ఫ్రూల్ సాహేబు కిలకిలనవ్వుచు బయటకువచ్చెను.

# వాఁడేవీఁడు.

## ఇరువదవ ప్రకరణము.

### సూదిపోటు.

తనవిజయముఁ దెల్పుటకు జమీలియాయుండుగదిలోనికేఁ బోవ, ఫ్రూల్‌సాహేబునకు జమీలియా కానరాలేదు. మరి కొన్నిగదులు వెదకుచుండ, నామె కానరామి సంశయము వృద్ధియగుచుండెను. ఇంకొకగదిలోనికిఁ బోయి వెదక నందేమియుఁ గానరాలేదుగాని, తలుపులుమాత్రము బలవంతముగాఁ దన్ని తీసినటులనుండ, "సరే బాగానేయున్నదిరా!"యని యనుకొని నలుదిక్కులు చూచుచుండ, నెదుటిగదిలోనున్న యరిందమ్, ఫ్రూల్‌సాహేబునుజూచి,

"చాలాదినములనుండి హుజూర్‌దర్శనము దొరకనందున నేఁడైన జూచిపోదునని తలంచి వచ్చినాను,"

"ఓహో! వచ్చినారా? మీరురాకుండినా? ఈనాటికి తిరిగి దర్శనము దొరికినది. మిమ్ములను విడిచియుండజాలక విచారించుచుండ మాప్రియమిత్త్రుఁడు దేవేంద్రమిత్త్రొకనాఁడు కానరాగానే యాయనద్వారా నాసంగతి తెలియఁజేసుకొంటిని. ఆతడు చెప్పెనా?"

"చెప్పను—ఎందుకుచెప్పను? మీరంతదయతో తెలియజేయ చెప్పకుండుటయెట్లు?"

"ఓహో! అలాగునా? అయితే నీరావిషయము తెలిసియేవచ్చినారు? మిక్కిలి త్వరగానే వచ్చినారు—ఏదీ—నిన్నరాత్రియేకాదా?—కాని మీరింతత్వరగా రాగలుగుదురని మాత్రము నేను తలంపజాలకపోతిని. ఏమైతేనేమిగాని, మీరు వచ్చుట, మంచిపనియే చేసినారుకాని, మిత్రునుకూడ మీరు తోడుగ దెచ్చుట మంచిపనిగాదు—మీరిపుడాతని దీసుకరాకున్న, మరికొంతకాలము బ్రతికియుండునేమో?"

"మీచేతులోబడి చచ్చినాడేమి? దేవేంద్రవిజయుడు" నాకు సంశయముగానున్నది చెప్పుము.

"నేనేలచంపుదును—ఇంతకును అతనిచావు అతనే తెచ్చుకొనెనుగాని యింకొకరు తెచ్చినదికాదు. నేనైతే వానిశరీరము ముట్టలేదు. పోనీ—అయినదేమో అయినదికాని మీవద్ద నిపుడేమైన నాయుధములున్నవా?"

"ఉన్న నేమి? ఉండకున్న నేమి?"

"ఆహా—అందుకుకాదు—మీరు నిరాయుధులుగా నుండగనే నేను కొంచెము వెనుకకు పోయెదనని"

"ఏమి—మీస్వాధీనములో నాయుధములు లేవనియా మీరనుకున్నది—"

"నాకడ నాయుధమేయుండిన నింతసేపా! మీరీపాటికి యముని జూచుచుండరా?"

"ఆహా! అటులనా?"

"ఎకసక్కెము లక్కరలేదు—
నన్ను మీరు పట్టుకొనుటకు మీ ప్రాణములైనను కోలుపో సిద్ధముగానున్నారు, మిమ్ములను తప్పించుకొని, మిమ్ములను నాశనము చేయవలెననే పెద్దతలంపుతో నున్నాను నేను. కావున నిం దెవరు గెల్చెదరో చూతము గాక—"

"మాటలతో ప్రయోజనము లేదు. ఇదిగో నిన్నిపుడే పట్టుకొనుచున్నాను—ఇపుడు నీవేమి—"

అనుచుండఁగ ఫూల్‌సాహేబు యకీంధమ్‌మీఁది కురికెను. ఇరువురును బెనుగులాడి పెనుగులాడి, యొకయరగంట యగువరకు నిరువురు నలసిపోయిరి. కాని యకీంధమ్ ఫూల్‌సాహేబుమీఁద పైఁజేయియైచి, వెనుకకు గెంటివేసెను. అతఁడు పునశ్చ క్రోంచముగా మ్రుసలి, తన మొలనున్న బాకుపైఁ బొడుగుపాటి సన్నని, తళతళమెఱయు సూదినిఁదీసి యకీంధమ్‌పైఁ గురికెను. ఆసూది తన మొలనుండి తీయుట యకీంధమ్ చూడకపోలేదు. అది విష సంబంధమైనదనియు, దన్మారలమున, జాప్య నిక్కమనియు నెఱిఁగి, తనమీఁది కేగుదెంచుచు, తననా సూదితోఁ బొడువ సిద్ధముగా వచ్చిన ఫూల్‌సాహేబుచేతిలోని సూది లాగికొని, ఫూల్‌సాహేబు ముక్కుమీఁదను, లలాటముమీఁదను, దానితో రెండుమూఁడు చోట్ల పొడిచెను. తనచేతినుండి యెపు డాసూది వెడలెనో యపుడే ఫూల్‌సాహేబు నిరాశఁజెందెను. ముక్కుమీఁదను, లలాటముమీఁదను సూదితో నకీంధమ్ రెండుమూఁడు దెబ్బలు కొట్టినపిదప ఫూల్‌సాహేబునకు తలత్రిప్పఁదొడఁగెను—శరీర

మచేతనమయ్యెను—మతి పోవుచుండెను—నోటినుండి చొంగలు గార్చుచుండెను—నేలవ్రాలెను.

అరీందమ్ తృప్తిఁబొందెనేకాని, ఫ్రూల్‌సాహెబు మరణించునేమోయనుభయ మీతనికి మెండుగఁగలదు.

కాళ్లేతులకు బేడీలువేసి, సమీపముననున్న మంచము దగ్గఱకు లాగి దానియొక్క కోటికిని ఫ్రూల్‌సాహెబుచేతికిని గొలుసులుబిగించెను.

# వాఁడే వీఁడు.

## ఇరువదొకటవ ప్రకరణము.

### త్రాఁచుపాము.

అరిందముఁ డప్పటికి దేవేంద్రవిజయుంగూర్చి జ్ఞాపకము వచ్చి నలుగడల వెదకఁదొడఁగెను. కాని యెన్నిగదులు వెదకినను దేవేంద్రవిజయుఁ డెందును గానరాలేదు. అనుమానము వృద్ధియై భయమధికమై ఫూల్‌సాహేబుమాటలఁ దలంచికొనినకొలఁది దేవేంద్రవిజయుఁ డిఁక నీలోకమున లేఁడని దిగులుజెందియుఁ దిరిగినస్థలములందే తిరుగుచు వెదకినగదులనే వెదకుచు, పిచ్చివానివలె దిరుగుచుండెను. అట్లు తిరుగుచుండ నొకగదిలో నొకప్రక్కనుండి "హుఁ—హుఁ—హుఁ" యను మూలుగుధ్వని వినవచ్చెను.

"ఏమిది! నిర్మానుష్యమైన యీస్థలమున, నేదెసనుండి కలుగుచున్న దీధ్వని!" యని శంకించి నాలుగుమూలలు తిరుగఁ దిరుగ, నొకప్రక్కనుండి యామూలుగు స్పష్టముగ వినవచ్చుచుండ, నిది యేమైయుండునని యెంచి యాకడనున్న చిన్నగవాక్షము చూడ, నాతలు పావలివైపునకు మూయఁబడి తనకాలితో నెంతతన్నినను రాదయ్యెను. ఆతలుపున కేదెస

బందులుగాని, గడియగాని, యేమైనన్ను నతెరువఁబడునో తెలియఁజేయుటకు లేనయ్యె. ఆతలుపు తీగెలమరలలో నిర్మింపఁబడినది. కాని యరిందము యొక్క మోటుదెబ్బల కోర్వఁజాలక యొకటికి తలుపు పగిలి, యొకచెక్క క్రిందికి వ్రేలాడుచుండెను. అది చూచి, యాతలుపును దనవైపున కధికప్రయత్నమున లాగిచూడఁ దలుపు పూర్తిగాఁ దెఱవఁబడి మూలుగుధ్వని స్వచ్ఛముగా వినఁబడెను. అది యొకమానవకంఠధ్వనిగ నెఱింగి యాగదిలో నొకమూలనుండిన యొకలాంతరు వెలిగించి దానిని లోపలికిదింపుచు "నీవెవరి"వని యడుగ నాకంఠధ్వనివిని—" అరిందమ్ బాబూ! మీరిక్కడ నున్నారా—చచ్చిపోవుచున్నాను మీ మొగము చూచి ప్రాణములిడువవలెనని యున్నాను. రక్షింపుడు రక్షింపుడు—" అనెను.

తక్షణమే యరిందమ్ నాల్గుగదులను వెదకి యొకగదిలో దొరకిన యొక పెద్దమోకువంటి త్రాటి నాతని కాధారముగా నా చీఁకటికోష్ఠలమునకు వదిలెను. భరింపరాని దుర్గంధము—చీఁకటి—అగాధము—ఆగదియొక్క లోతుగల నూయివలె గానవచ్చెను.

"ఓహో దేవేంద్రబాబూ—తిరిగి మనమిద్దఱము బ్రదికి యొకరినొకరు కలుసుకొందుమని తలంచలేదు."

"ఫ్రాంల్సాహెబు, పిశాచమనుష్యుండో—మానవమాత్రుఁడుగా దలంచకుము. ప్రస్తుతము నన్నురక్షించి పైకిలాగినచో నన్నియును జెప్పఁగలను నేను పీకవరకును కంపుబురదగుమ్మిలో పాదుకొబడినాను—"

దేవేంద్రనాథుఁడు తాఁటిని బట్టుకొని నరేందన్ మెలమెల్లగఁ బైకెలాగుచుండెను “ఫ్రాల్ సాహెబుమాట కేమిగాని జుమీలియా తాను సంతకముచేసినటుల, ‘త్రాచుపామే,’ సుమా” అనుచుఁ జాలవఱకు పైకెలాగుచుండెను. కాని బురదలో చాలలోఁతున కుతుకవఱకుఁ గూరుకపోయినమనిషి నొకమనిషి, యొంటరిగఁ ద్రాఁటిసాయమునఁ బైకిలాగఁ బ్రయత్నించుట యాశ్చర్యకరము.

అరేందన్ చేతినుండి తప్పించుకొని గదిలోనుండిపోయి గుప్తద్వారమునఁ దాఁగిపోయిన జుమీలియు, ఫ్రాల్ సాహెబు దేవేంద్రనాథుని పెనుగులాటఁ జూచి యానందించి, యనంతరము మిత్రాబాబు పాతాళమునకరుగుట నవలోకించి, ఫ్రాల్ సాహెబు తనగెలుపును గెలుపునుగేశముతోఁ దనకొఱకు వెదకుచు నరేందన్ యెదుటఁబడి, యాతనితోఁబోరాడి యాతనిచేఁ బరాజితుఁడై బంధింపఁబడిన యావదంశములును జూచుచునే యుండి యరేందన్ దేవేంద్రవిజయునకు సాయమొనర్చుచుంటఁ గనిపెట్టి, చేత నెట్టనిరంగుద్రావకముగల సీసానొకదానిని బట్టుకొని యరేందన్ యెదుటఁబడి,

“త్రాచుపామా! నీపాలిటకాలసర్పమా!! ఇంక నాచేతిలోనివాడనే. ఇష్టదేవతాప్రార్థనము చేసుకొనుము—” అనుచుఁ గిలకిలనవ్వుచుఁ దనచేతనున్న సీసామూఁతఁ దీయుచుండెను.

“ఈద్రావకము దీని కెక్కడినుండి వచ్చినదో కదా? అపాయము తప్పించుకొన బ్రయత్నింతునన్నను చాలచిక్కులలో నున్నాను. నాప్రాణరక్షణకు చూచితినా దేవేంద్రవిజ

యుషు తిరుగ నీకూపములో మునిగిపోవును. కాక యీతనిర క్షణకే చూచితినా, నాచావు నిక్కము. ఇందేమి చేతును" అనుచు వెనుకముందులరయుచుండ, "ఏమి, స్థిమితముగానున్నావా? ఊరకుంటి వేమి? మిత్రాన్ ప్రాణరక్షణ కేమిగాని, నీబ్రిదుకు చూచుకో,—" అని బాబూలాల్ యూవలికెను. "అవును నీవంతదాన వవుదువు. మొత్తముమీద ఫ్రాల్సాహెబునకు తగినదానవే—" అనుచు నరేంద్రుడు మిత్రాబాబును పైకలాగుచునేయుండెను. "మాటలసందడిలో నీమిత్రుని ప్రాణరక్షణ చూచుచున్నావు. ఈద్రావకముసంగతి యెరుగకున్నావు. ఇదియే అగ్నిద్రావకము. ఇదియొకచుక్క శరీరమున నెచ్చటపడినను వాడంతటితోసరి. నిన్నటుల చంపెదను. కాని యిప్పటి నను మించినది లేదు. నీవు నన్ను వేడుకొనుము. నీకు ప్రాణదానముచేసెదను. నన్ను బ్రతిమాలుకొనుము—"

"నిన్ను బ్రతిమాలుకొనునంత పిరికివాడ నెవడును లేడు—" అనుచుఁ గూపమునుండి మిత్రాబాబును జాలవఱకు బయటికిలాగుచుండెను. బాబూలాలయూ తక్షణమే సీసాలోనుండి యొకచుక్క నరేంద్రునిమీఁద వేసెను. నరేంద్రుఁడు ధరించినదుస్తులు మిక్కిలి దళసరివైనవగుటచేఁ దనకోటుమాత్రము కొంతవఱకు ద్రావకమువలనఁ గాలిపోయెను.

"రుచితెలిసినదా? ఇంకనైన నన్ను వేడుకొందువా?"

"ఇకఁగాదు! ఆద్రావకమంతయు పోసినను నరేంద్రుడు ఒకనీచస్త్రీని ప్రాణదానముచేయుమని వేడుకొనడు—నమ్ముము" అనుచుఁ దనప్రయత్నము తాఁజేయుచుండెను.

జూమీలియ తనకోపానలము ద్విగుణింప నాసీసా నెత్తి యరిందమ్‌మీఁద పోయఁబోవుచుండ నామె వెనుకనుండి యొకఁడు హఠాత్తుగవచ్చి యామెచేతినున్నసీసా లాగుకొని చాలవఱకు ద్రావక మామెమొగముపైఁ బోసెను. తక్షణమే యామె గిలగిలఁ గొట్టుకొనుచు నచ్చోటుబాసి పాఱిపోయెను. ఈసమయములో నరిందమ్ దేవేంద్రవిజయు నాభయంకరకూపమునుండి బయటికిఁ దీసెను. దేవేంద్రవిజయునిశరీరమంతయు బురద, పురుగులు, కంపుగలిగి యేవగలిగించుచుండెను. వీరిరువురు నానూతనపురుషు నెదుటనిలిచిరి.

ఈతఁడు ప్రాయమున నిరువదినాల్గింటికి మించఁడు. ఈతనికనుఁగవ చేరలఁ గొల్వఁదగును. శరీరము మంచికండగలిగి కట్టుగలదిగానుండెను. ఈతనిసలలాటము విశాలమై కనుబొమలు విండ్లవలెవంగి చూపున కింపైన యానందదాయకముగ నుండెను. ఈతనిశరీరమంతయు మలినముగానుండెను. ఇట్టియాతనితో, "బాబూ, నీవెవఁడవు? నీకటాక్షకారణముననే, నేనొకఁడను కాను. ఈతఁడును పునర్జన్మమెత్తినాఁడు. కాని నాయనా! ఏమిది? నాకుడి భుజము మండుచున్నది. ఆఁ- ఇది యాద్రావకమాహాత్మ్యమే కాఁబోలు!" అని యరిందమనెను.

"దైవవశమున సదయచేతస్కులమగు మేమిరువురమును నీకు కృతజ్ఞులము. కాని నాయనా! నిన్నెన్నఁడును నేను చూడలేదు. నీవెవ్వరో వినఁగోరుచున్నాను," అని దేవేంద్రబాబడుగ, "నేనెవ్వరైన నేమి—కొన్ని యీయనను (దేవేంద్రవిజయుని జూపుచు) నేను సన్నరాత్రి చినాను. ఈయన బంధింప

బడియుండిన గదితలుపు తొందరలో జమీలియాం వేయుటమఱ చినందున, నేనాగదిలోనికి పోయి, యీయనను నాగుండెలకా నుకొని పరుగుపరుగున బోయి అరీందమ్గారితోటలో బరుండ బెట్టి, తెల్లవారకపూర్వమే తిరుగ నాబందిఖానాకుపోయి చేరు కొంటిని. ఈయననుగూర్చి జమీలియాపూల్ నా పేరుల ప్రసం గముల చేసినగాని, అరీందమ్బాబుగారితోటలో నుంచివేసిన కొంతభాగము చెప్పినయు, రక్షింపబడినవియు, వెలుంచి అటుల గావించితిని నేనిటువరకెన్నడు అరీందమ్బాబు నెఱుగకున్నను ఆ యననుగూర్చి వినుచున్నందునను, ఆయనయిల్లు నేనెఱుగుదుందున ను, ఆయనకును, యీయనకును ఉద్యోగరీత్యా సంబంధమున్న దని వినినందునను అటులచేసితిని. ఇతి నేబలతిరుగవచ్చునో తె లియదు—" అనెను,

"ఆహా! అటులనా! అయితే నీవెవరునాయనా?"

"అయ్యో! నేనెవ్వరనేమి? నా విచారకరచరిత్ర చె ప్పి మీమనస్సు మరింతనొవ్వజేయుట నాకిష్టములేదు. లోకము న నదృష్టహీనులచరిత్ర వినుటకంటె దుఃఖకరమైనది విషాదక కార్య మింకొకటియుండదు"

"మాకు ప్రాణదాతవై యుండియు మేమింతగా కోరు చుండ మీచరిత్ర చెప్పకుంటె మేమికలము? మీ పేరేమి?"

కొంచెమునే పూరకుండక "నాపేరు సిరాజ్ హక్—అ దృష్టహీనుడను——" అని యాతండనెను.

సిరాజ్ హకను పేరు తనచెప్పిని బడిగానే, తన కేమి జ్ఞాపకమునకు వచ్చెనో కాని, యరీంద మీనూతనపురుషుని సఖ

శిఖాపర్యంతమును జూడఁదొడఁగెను. తృప్తియు, సంతోషము నొక్కసారి కలిగెను.

“గుల్‌సుమును మీరెఱుగుదురా?”

“ఆహా! ఎఱుగుదును. తమ్ముఁడిగా కుమార్తె—”

“—అయిన—మీరెట్లు బంధింపబడినియుంటిరే ఏ కారణమున నెవరిచే బంధింపబడిరి?”

“ఫ్రాన్స్‌సాహేబుచే—కారణ మడుగకుండి—ఆగులాం సిఫార్సు నాకు ప్రాప్తము లేకుండుటే కారణము—” అని కంటతడిఁబెట్టుకొని దుఃఖించుచుండెను.

“ఏల దుఃఖించెదరు. ప్రాప్తకాలము ముందున్నది. ఇప్పుడు మించిన దేమున్నది?”

“ఇంకా ప్రాప్త మెక్కడనున్నది? గుల్‌సుమ్ యీలోకమును విడిచెనగదా! తమ్ముఁడిగా కుటుంబము సంతతిని ఫ్రాన్స్‌సాహేబే తనపొట్టను బెట్టుకొనెను—”

“గుల్‌సుమ్ చనిపోలేదు—తమ్ముఁడిగా చనిపోయినాడు—”

ఈమాట చెవినిబడినతోడనే సిరాజ్‌హీనుని మోమునకుఁ గ్రొత్తవన్నెవచ్చి మొగమున లేనగవు, నాశ్చర్యమును గానరా, “గుల్‌సుమ్ సజీవియైయున్నదా? జీవించియుండిననేమి, లేకున్ననేమి? నాటితోనే ఆమెకును నాకును ఋణముల్లు దీరినది—” అనుచు నేడికన్నీరు నించుచుండెను. అకింద మదిగని యించుకతడవు తాననుచింతించి, “అన్నా! ప్రేమానుబంధపాశ మెంతబలమైనది!” అని యనుకొని, “సిరాజ్‌హీన్! చింతించిన

ఫలమేమి? గతోరిసకస్యక వించియున్నదిగదా! మీరాయిరువురికు
ను వివాహముజరుపుభారము నాయది. కాని సీవిచ్చటనున్న కా
రణమును, జమీలియా విశాలగముగాయినుండి నన్ను తప్పించ
గలిగినవిషయమును నాకు తెలియజేయ గోరుచున్నాను."

"మీరడుగుచున్నారు గావున చెప్పుచున్నాను. త
మూజుదీన్ బ్రతికియుండిన నాటనుండియు నేను గుల్సుము
ను ప్రేమించేవాడను. గుల్సుమ్ కూడ నన్ను ప్రేమిం
చుచుండేను. మాయన్యోన్యానురాగములు తన్ముజుదీనుకు తె
లుకనో. ఆయనయును సమ్మతించెను. గుల్సుమును తన
స్వాధీనము చేసికొను నుద్దేశముతో, ఫూల్ సాహెబు నన్ని దినం
బంధించియుంచెను. అనంతర మొకనాడు గుల్సుమ్ చెరసాలో
బడెనని వింటిని. తరువాత నామెచరిత్రమేమియు తెలియక
చింతించుచున్నాను. తన్ముజుద్దీన్ కూడ గతించెనని తెలిసినది.
ఈఘోరములకన్నిటికిని కారణముగుఫూల్ సాహెబును పట్టుకొను
టకు అరిందమ్ అను డిటెక్టివ్ గారు మిక్కిలి శ్రమపడుచున్నా
రట. వారిని నేనెన్నడును దర్శించియుండలేదుగాని పాప మా
యనను చంపుటకు ఫూల్ సాహెబు సిద్ధముగానున్నాడు.
ఇప్పుడు మిమ్ములను చంపుటకు దెచ్చిన ద్రావకమేమిటో తమ
కు తెలుసునా? అది పిక్ రిక్ ఆమ్లము. అది శరీరముపై బడిన
తోడనే శరీరము కాలిపోవును. నేనిప్రక్కగదిలోనే బంధింపఁ
డియుంటిని. జమీలియా కొంచెముసేపు క్రిందిగదులలో బరు
గిడుచు నేనుపరుండియున్నగదిలోనుండి పోయి, యాతొందర
లో నీగదితలుపు దెరచి సీనాతో మీతావునకు వచ్చుచుండుట

నేను చూచితిని. అదిగని నేఁడేదో యాపద రానున్నదని" యనితలంచి, నేను ద్వారమునద్దకు వచ్చి చూడ జూలియా తొందరలో తలుపు బయిటబంధించుట మఱచుటచేత, నేను లాఁగఁగనే తలుపు తెఱవబడెను. కావున నేను బయటకురాఁగలిగితిని. వచ్చిచూచుసరికి సంభవించనున్న యాపదఁజూచి, నేనటుల సిసీసా లాఁగుకొని జూలియాను మామెపై బోయుచుంత, కిలకిలగొట్టుకొనుచు పారిపోయెను. కాని జూలియాకెంత యాపద యుండెను. ఏలనన, దానికెవిరుగు దామెను తెలుసును. ఇంతేయగాక ఆమెధరించినవస్త్రములు మిక్కిలి దళసరివి యగుటచేత నవి కాలి శరీరము తాకకమునుపే దానిని కప్పుకొని యుడిగిపోవును—"

" మీచరిత్ర నాకు మిక్కిలి విచారము గలిగించుచున్నది. మీరింతచెప్పుచున్నారు కనుక నేనెవరో చెప్పకున్న తప్పిదముకాదా! నేనే అరవిందమును—"

" ఆహా! తామేనా అరవిందముబాబుగారు—నాసమస్కారములు గైకొనుడు—బాబూ మీరుమాత్రము జాగ్రత్తగానుండుడు గుల్ సుమ్ జీవించియేయున్నదని యనుచున్నారు కదా! తమ్ముజ్జోన్స్ చనిపోయినాఁడే—ఆమె యిప్పుడెచట నున్నదో?"

" ఆమె యిప్పుడు మా యింటిలోనేయున్నది. ఆమెకిప్పు ప్రాణభయములేదు. మీరు మాతోరండు"

" చిత్తము—మీరెవరండీ-"

" ఈయన ఇన్ స్పెక్టరు దేవేంద్రనాథ్ మిత్రా బాబు."

"ఈయనను నిన్నరాత్రి చూచినాను—"

"సరేకాని మీరిపుడేలమాతోరారాదు ?"

"అబ్బో—చాలాచిక్కువచ్చెను. నేనిపుడు తప్పించుకొని మీతోవచ్చినను నన్నెవరైనను పట్టుకొని బాధించకమానరు. కావున నేను మీతోవచ్చుట సలహాకారికాదు. ఈకారణముచేతనే నిన్నరాత్రి యీయననాతోటలో వీడి యిచ్చటకువచ్చి నాబందిఖానాలోనుంటిని."

"సరే మాయండనుండ మీకెంతభయములేదు. నేను ఫ్రాల్ సాహేబును బంధించియుంటిని. అచటికి బోయి వానిని స్టేషనుకు దీసుకపోవుదమురండ"నుచు నచ్చోటువదలి యాగదిలోనికేగిరి. అచట మంచముదప్ప మరియేదియుఁగానరాలేదు. అరీందమ్ నిశ్చేష్టుఁడై నిలిచిపోయి కొంతతడవూరకుండి యాశ్చర్యముతో, "ఈభవంతియంతయు కీలుయంత్రములతోను, గుప్తద్వారములతోను, కట్టబడినటులనున్నది. ఇదియేదో యీచిత్రగృహములోనున్న చాలక్ లాగనున్నదే?," యనెను.

"ఈగదిచాలక్ మాటకేమి? మనమేల ఇంట్లిజన్సు డిపార్టుమెంటును వుంచి యీయిల్లు పడగొట్టి వారిని పట్టుకోరాదు," అనుచు క్రోధముతో మిత్రాబాబు పలికెను.

"అది లాభములేనిపని—అది యామదిచేయగలపని మనమిపు డన్నిగదులును చూచివచ్చెదము రండు—" అనుచు వీరుముగ్గురును బోయి యాభవనము చూచితిరేకాని యేమియు లాభము లేకపోయెను. అరీందమ్ యొక్క విస్మయమునకు మితిలేదు.

బురదతో కూడిన కంపుదుస్తులతో నెట్టుబులనో దేవేంద్రబాబును, అరిందమ్‌సిరాజ్‌హీనులును, బయలుదేరి యాస్థలము వీడిపోయిరి.

పక్షులు గూళ్ళ సేగుచుండెను. మేంతకుంబోయిన పసుల మంద లిండ్లకు మరలుచుండెను. సూర్యాస్తమాన మగుచుండెను. సంధ్య వెలుంగుంగూడం బోవుచుండెను.

---

# మనోహరి.

ఇదియొక చక్కని తెలుంగు నావల్, అనగా చమత్కారికథాసందర్భముగల వచన ప్రబంధము, తా॥ సీ॥ రామశాస్త్రిగారిచే వ్రాయబడినది.

కోమల మతిసుగమంబై, హాస్యశృంగారాది రసభూయిష్ఠమై, చదువరులకు వినోదకుతూహలంబులను బుట్టించు. ఈ నావలను తెలుంగు జదువ నేర్చినవారందరు, ముఖ్యముగా స్త్రీలు చదివి తీరవలయు. శైలి, వీధిలో బనిచేయు కూలివాండ్రు, ప్రొయ్యిదగ్గర వంటకొనుచుండు స్త్రీలుకూడ తెలిసికొనగలుగునంతసులభము.

ప్రతి 1 కి వెల రూ. 0-12-0.

రామశాస్త్రి అండ్ కో.,

బరంపురం. **Berhampur.**

# హాఁడేవీఁడు

## ఇరువదిరెండవ ప్రకరణము.

### ప్రతిజ్ఞ.

వెనుకనుండివచ్చి తనచేతనున్న పిక్నికామ్లము తనమీఁదనే పోసి కార్యభంగమొనర్చి, తనప్రాణమున కపాయమాపాదించిన సిరాజ్ హామదకుఁ బ్రత్యపకృతి నెంతత్వరలోనైనఁ జేసి తీరవలెనని పంతగించి జరిగినయాపదంశముల నెఱుకసేయనెంచి యరీందంబాబుచే సంకెలలువేయబడి మంచమునకు బంధింపఁబడినపిదప నరీందమా వోటువదలిన కారణమున నట కీలుతలుపుఁ దెఱచికొని పాతాళభవనమునకుఁ బోయి యచట తానదివఱకు పోట్లాటతొందరలో నరీందంబాబు కోర్వఁజాలక తనకుదానే చేసికొనిన విషగాయమువలన బాధపడుచు మూలుగుచున్న ఫ్రాన్ సాహేబ్ కడకుఁ బోయి, యాగదిలోనున్న యొకసీసాలోని తెల్లనిద్రావకమున యొడలెల్లఁ దడిపికొని తనకుఁగలిగియుండిన ప్రాణభీతిని తప్పించుకొని తనప్రియునియాపదగూడఁ దొలఁగింపనెంచి, యాతనికి గాయముతగిలినచోటనే మఱింతగాయపరచి యచ్చట స్రవించురక్తపుస్రావమున, తదనుహాలమగునౌషధము ప్రయోగించి, యాతని రక్షితునిజేయ సంకల్పజుకును గను లర

మోడ్పుమోడ్చియున్న ఫ్రూల్‌సాహేబు కనులువిప్పి జూమిూలి యూను గౌఁగిలించుకొని—"ఓ హాూ! వచ్చినావా! నేనెం తచేసినను నీఋణము దీర్చుకొనఁజాలను. ఖైదులోనున్న పును తప్పించితివి. ఇప్పుడు పోనున్నప్రాణమును పోకుండ గాపాడితివి. ఇంకేమికావలెను. ప్రియురాలన నీవే ప్రియురాలవు—" అ నియనెను.

"ఇందు నాఘనకార్య మేమున్నది. నావిధికృత్యము నేను నెరవేర్చితిని. సరే మాటలతో నేమిప్రయోజనము న్నది? సాలెపురుగు పురికొసమైనది. మేక పులియైనది. యే ను మేకైనది. కర్ర కత్తియైనది. తానున్నగదితలుపు గొ ళ్ళెమువేయ నేను తొందరలో మరచినందున సిరాజ్‌హీను త ప్పించుకొని పైకివచ్చి నన్ను చెరపవచ్చినందున నేను తప్పిం చుకొని నీదరికి వచ్చితిని. కాపాడుభారము నీదే—"

"అమ్మమ్మా! జుమిూలియూ!! నీవెంతదానవే!!!

అరీందమ్ బ్రతికియుండగా నీకిట్టి భంగపాటులు నా కిట్టి యూపదలే—కాని మనస్థిమితము, దేహసౌఖ్యము మొద లగునవి తలంచలేము"

"ఆమదాననైన నేను చేతగాక యూరకుండినను, పురు షులైనమిూరే యిటుల నుపేక్షచేయుట తగదు"

"సరేకాని సిరాజ్‌హీనుడు నిన్ను చెరుపవచ్చినాడుగా! ఏమి!! ఎంతకండకావరము—ఔరౌర—ఎంతదారుణ వాక్య ములు వినవలసివచ్చినది. ఇదిగో కత్తిముట్టి చెప్పుచున్నాను. ఈకత్తితో అరీందమ్‌సిరాజ్‌హీనుల నిరువుర నొక్కసారిగ నరికి

వేయుటయో లేకున్న వారిచేనేను చంపబడుటయో జరిగితీరవ లెను. నీవు కొంతసేపు విశ్రాంతి జెందుము. సాయంకాల మై పోయినది; యీరాత్రి గుప్తభవనమున నాయాంతరంగికులతో మాటలాడి యన్నియు స్థిరపరచుకొందును. కాని యరీందమ్ యిపు డింక నేమిసేయుచున్నాడు?"

"ఇంక సేయుట కేమున్నది. మనకొరకు మన 52 గదులును వెదకివెదకి కానరానందున వచ్చినవారిద్దరును సిరాజ్‌హీనునికూడా తీసుకొని హుగ్లీకి మరలిపోయిరి. వా రేమేమిపన్నాగములు పన్నుచున్నారో?"

"ఏమిపన్ననెంచిన నేమి? నీవు నిర్విచారిమగ పోయి విశ్రమించుము" అనుచు వీరిరువురును వారివారిపనులు నెరవేర్చుకొనఁబోయిరి.

---

# వాడేవీఁడు

## ఇరువదిమూఁడవ ప్రకరణము.

### వివాహము.

దేవేంద్రవిజయసిరాజ్‌షాహులు సమేతముగ నరేందర్ గృహముసకుఁబోయి యారాత్రి కొంతతడవు విశ్రమించెను. గుల్ సుమిచటనున్నదని సిరాజ్‌షాహునకుఁ జెప్పి మరునాఁటియుదయమున గుల్‌సుమ్‌నుబిలిచి, “అమ్మా! నీకు సిరాజ్‌షాహుని చూడవలెనని యున్నదా?” అనియడిగి, “చూచి చాలకాలమైనదిగాబోలు పాపము” అని కొంతవగచెను.

విచారముగామారినసిగ్గుచే తలవంచుకొని, “ఫూల్‌సాహెబువిశాచిచేతులనున్న సిరాజ్‌షా నెక్కడ? నేనెక్కడ? కాలూరాయిచేతిలో బడియుండినదో నాతఁడిపుడీలోకమున లేనే లేఁడు. పదియేఁడులనున్నను, నేనాయనను మరల చూచునంతటి భాగ్యము నాకెక్కడనుండివచ్చును?” అని గుల్‌సుమన నాపక్కగదిలో నేఁటిలిచి యామాటలవినుచున్న సిరాజ్‌షాహునిమన మెటులనున్నదో, వర్ణనాహఁకంబయ్యెఁ, గేవల మూహ్యము. కాని, “ఆహా! నన్నింతగాప్రేమించుచున్నదిగదా!! నేను గానరాకుంటకు తానెంతవగచుచున్నదోగదా!!!” అని విచారించుచుండెను.

అరిందమ్—గుల్‌సుమ్ ! నీయదృష్టవశమున నీకోరినప్రియుఁడు సురక్షితముగ ఫ్రాల్‌సాహేబుయింట నున్నాఁడు. నిన్నటిరోజంతయు నేను, మిత్రాబాబును పోయి, జుమీాలియాఁ, ఫ్రాల్‌సాహేబుంచే మోసపోయితిమి. తుట్టతుద కొకయాఁడు దానిచే చంపఁబడుటకు సిద్ధముగానుండిన నన్ను రక్షించి ప్రాణదానమొసర్చెనయాఁతఁడు, సిరాజ్‌హీను, నీప్రియుఁడు, ఇఁడుగో పాణిగ్రహణముసేయుము—" అనుచు సంతోషముగా సిరాజ్‌హీనుని గుల్‌సుమ్‌న కప్పగించెను. వారొకరినొకరు జూచికొని యమితానందముఁబొందుచుండిరి. అరిందమ్ వీరివివాహమహోత్సవమునకుఁ దగిన యేర్పాటులుజరిపి, తనతల్లిని యుభయపక్షములవారికిని పెండ్లిపెద్దఁజేసి యామెమాటప్రకార మొకసుదినమున వీరివివాహమహోత్సవ మత్యుత్సాహముగ జరిపెను. అనంతర మా దంపతుల కరిందమ్ తన రెండెకరబంగాళా, బసగానిచ్చి, యప్పుడప్పుడు, వారికి కావలసినసాయ మొసర్చుచు, గుల్‌సుమ్‌వలన తనకు, పిశాచీపిశాచులనుగురించి తెలియవలసిన యావదంశములును తెలిసికొనుచు, వారు సుఖముగా కాలము బుచ్చుటకు వలయునన్ని సదుపాయములు చేయుచు, "ద్రోహులు శిక్షింపబడువరకు, మీరు మాజమీాందారీక పోరాదు." అని వారికప్పుడప్పుడు చెప్పుచుఁ గొన్నిదినములు గడపెను.

మాచదువరులు సిరాజ్‌హీన్ గుల్‌సుమ్‌లకు, వివాహముజరిపినందుకు సంతసింతు రేకాని, యరిందమ్‌యొక్క మనసునందలి యస్థిమితమును దలంపకుందురేమో?

ఈతఁడు తన దేహసౌఖ్యమునకుఁ జూచుచుండలేదన పొగడ్త కాదు. నిద్రాహారములు మఱచెనన, నతిశయోక్తి కాదు. స్నానపానాదుల కంతగాఁదలంచలేదన నసత్యముకాదు. ఇటులనితఁడు పూల్‌సాహెబును బట్టుటకుఁ బ్రయత్నించుటలో నెంతశ్రమయయినఁ బొందుచుండెనన కవిసమయము కాదు. రేయింబవళులన్యత్ర్యాస మెఱుఁగక యీతఁడు ప్రయత్నముసలుపుచు కాలముఁబుచ్చుచుండెను.

పట్టణమున నెచ్చటఁజూచిన రక్షకభటులే—తనకు సాయమొనరుపఁగోరి యధికారులయనుమతము నొంది తెప్పించుకొనిన చారు లెచ్చటఁజూచినను గుప్తవేషములతో సంచరించుచుండిరి.

రేవతిని వెదకునుద్దేశముగలవానివలె పైకి యాలోచనలుసేయుచు, రేవతీబద్ధమనస్కుండగు దేవేంద్రవిజయుని తనయింటనే యుండనియమించెను.

ఆసమయమున, నింకను చుట్టుపట్లఁగూడ నిరూపణార్థము ప్రయత్నములు సలుపఁబడుచుండెను.

-⁂-⁂-

# వాఁడేవీఁడు.

## ఇరువదినాల్గవ ప్రకరణము.

### విద్యుచ్ఛక్తి.

ఒకనాఁటియుదయమున దేవేంద్రవిజయుఁ డరిందమ్ బాబును దర్శించి, "నేనీకేసువచ్చినది మొదలు మాయింటికైనను పోలేదు. కూనీదారు దొరికియు దొరకలేదు. రేవతిజాడ కానరాలేదు. రేవతిని వెదకబోయిననేను గొప్పయాపదనుండి, చావుదప్పి కన్నులొట్టవోయెనన్నటుల, జుమిలియాంపూల్ సాహేబుల చేతులనుండి, మృత్యుముఖమునుండి, తప్పించుకొని, జపము వదలి లొట్టలలోబడితినుచునటుల మొదటిప్రయత్నముమానుకొని తుదకేమియుచేతగాక చేతులునులిమికొనుచు మిన్నకుంటిని. రేవతి యేమైనదో తెలియదు. తమ కామెయూనుపానులు దెలిసికొన నిచ్ఛలేనటుల నున్నది?"

"ఏమి! మీకు రేవతిని వెదకుపనియే ముఖ్యముగా నున్నటులనున్నదే——?"

"ముఖ్యమున కేమున్నది? ద్రోహులను బట్టుటకు ప్రయత్నించుచున్నాము. ద్రోహులచే బాధింపబడువారిని బట్టనున్నాము. ఏదైనను తమహుకుమ్ లేనిపని చేయుటలేదే."

"సరేకాని! రేవతిని వెదకుపనిలో మీకున్న శ్రద్ధ యింకొకపనిలో లేదు."

"శ్రద్ధకేమున్నది? దిక్కులేక పలుబాములఁబడుచున్న యబలను రక్షింపబ్రయత్నించుట మాకు విధ్యుక్తమే కదా!"

"సరేకాని మీరిప్పుడెటకేగుచున్నారు?"

"బజారునైపు"

"సరే త్వరగా తిరిగిరండు"

"చిత్తము" అని దేవేంద్రవిజయుఁడు వెడలెను.

"ఇతఁడు రేవతిని మిక్కిలి ప్రేమించుచున్నాఁడు. రేవతియొక్క యానుపానులు దెలిసికొన మిక్కిలి మక్కువగలిగియున్నాఁడు. ఇంక ద్రోహులు పట్టువడుదాక, రేవతీచరిత్ర నేరికిని దెలుపరాదు" అనుకొనుచు నరిందమ్ చావడిలోఁ గూర్చుండియుండ, నొకసేవకుఁడువచ్చి, "తమదర్శనమునకొక స్త్రీ వచ్చి నిలిచియున్నది. సెలవయిన దో వచ్చును." అన, రా సెలవొసంగ సేవకుఁడు పోయి యాస్త్రీని దోడ్కొనివచ్చెను. అంతట నాస్త్రీ ముసుఁగుతో, మలినమైనవస్త్రములతో పెద్దకనులతో నెరసినదేహకాంతితో వచ్చి యరిందమునెదుట నిలువ నాతఁడును—"మీరెవర"ని యడుగ "పూల్‌సాహేబు ఇంటిదానన"ని బ్రత్యుత్తర మొసఁగెను. ఈప్రత్యుత్తరము చెవినిబడగానే యరిందమ్ కొంచెముజల్డుకొని, తనమనమున నేమియనుమానించెనోకాని, "ఏమీ! నీవు పూల్‌సాహేబుయింటిదానవా?" అనియడిగెను.

“అవును—నేను జమీలియానని దుర్భ్రమజెంది జంకొనక్క-
ర లేదు—”

శిరము నొకయోరకువంచి, భ్రూయుగము ముడివైచి, తీక్ష్ణదృష్టుల నిగిడించి, అరిందమ్, చూచుచు మిన్నకుండెను.

“మీయనుమానములతోను మీయూహలతోను నాకు పని
యేమి? నేను చెప్పవలసినమాటలు నాలుగును చెప్పి
పోయెదను—కాని—మీకు ఫ్రూల్‌సాహేబు తెలుసు
నా? మీకాయనతడాఖా బాగా యెరుకయైనదికాదా?
ఆయనయింటిదాననే నేను—”

అరిందమ్ మిన్నకుండెను.

“నేనాయనకు మొదటియింటిదానను. నాపేరు మోహిని—”

“ఆఁ హా! ఈపేరు నేనెన్నడును వినియుండలేదే!”

“ఔను. మీరు నన్నుచూచుట కిదియే మొదటిపర్యాయము.
సరేకాని, ఫ్రూల్‌సాహేబు జయిల్‌ఖానానుండి తప్పించు
[కొనినసంగతి తెలుసునా?”

“ఆఁ—తెలుసును?”

“మిమ్ములను చంపుటకు గట్టిగాపట్టినప్రతిజ్ఞ తెలుసునా?”

“ఆఁ—తెలుసును—”

“ఇన్నిన్ని తెలిసియేనా? ఏమి తెలివైనడిటెక్టివ్‌లని మీరిటుల
నూరకగూరుచున్నారు?”

“మే మూరకుండలేదు. చేయవలసినప్రయత్నములు చేయుచు
న్నాము కాని మీరు ఫ్రూల్‌సాహేబున కిల్లాలనంటి
రే—అతనికి విరోధిగా ప్రవర్తించుచున్నారే. ఏమి
కారణము?”

" నాగోడబనంతయు నిపుడు మీకు దెలియజేయుటకు వేళకాదు. కాని మీరడుగుచున్నారుకాన సంగ్రహముగా చె ప్పెదను.

" నేను వయసుననున్న కాలములో నేననాథనై యుం డుట కనిపెట్టి నాకడ నప్పటికున్న స్థిరచరాస్తులపై నాసచే న న్ను తనకన్నివిధములచేతను స్వాధీనముచేసుకొని, కొంచెముకా లమైనను కాకపూర్వమే నాయాస్తినంతను అపహరించి నన్ను తరిమివేసి వేరొకదానిని చేపట్టినాడు. నాటనుండియు నేను వానిపై నీర్ష్యావహించి చంపుటకు సిద్ధముగానున్నాను. ఖయి దునుండి తప్పించుకొని, ఒకటిరెండుహత్యలుగావించి గంగానది నీదుచు ఒడ్డుననున్న చెట్టుకొమ్మపట్టుకొని తప్పించుకొంటిమను గ ర్వములో నుండగా నేనాకొమ్మనే కత్తితోనరకివేసినందున దా నిక్రిందనేయుండిన సుడిగుండములోపడి, తుదకు చావుతప్పి క న్నులొట్టవోయెనన్నట్టుల నెట్టెటులనో బ్రతికిపోయి మీకును మీవారికిని లెక్కలేనన్నియపకృతు లొనర్చి తుదకిపుడు తనప్రి యస్నేహితుడు గారితోకలుపుకొని మొత్తము పదముప్వురిలో తాను మొనగాడై మిమ్ములనీరాత్రి చిత్రవధగావించి హత్య యొనర్చి రేపటియుదయమీపాటికి స్త్రీరాన్నసమేతముగ తనయ నుచరులతోపాటు విందారగించనున్నాడు. నేనిచట చాలసేపుని లుచుట కూడనిపని,—కాని మీరు మిక్కిలి విద్యావంతులు ను మంచివారును గాన మీకు రానున్నయాపదవిని సహించ జాలక మీకిపుడె తెలియజేయుచున్నాను. మీప్రాణమును మీరు కాపాడుకొనినంతమాత్రమున మీబహద్దూరీక విజయ

ముకాదు. మీరక్షణ మీరుచేసికొనుచు ద్రోహులను పట్టుకో నవలెను. కాకున్నచో మీరు డిటెక్టివులేకారు”

“ అయితే ఫ్రూల్‌సాహేబు తనదోపిడిగాండ్రసమేతముగ నా యింటికేవచ్చునా?”

“ అందుకు సందేహమేమిటి! నామాటలయందు మీకింతగా విశ్వాసమున్నట్టుల తోచకున్నది ! మీవిశ్వాసముతో నాకేమిపని ? నాపనిలో నేనుండనే యున్నాను. నిన్న రాత్రి కాలూరాయి—దోపిడికాండ్రకెల్ల నధ్యక్షుడు—యొక్క పాతాళదివ్యభవనమున తనయనుచరులును తానును యీరాత్రి మీయింటికివచ్చి చంపుటకు కత్తులుముట్టి వాగ్దానములుచేసినారు. పరమచండాలుడైన వీడెటుల మీకు దాపరించినాడండి !! కాలసర్పమై పొడిచిచంపివేయును. పెద్దపులియై మ్రింగివేయును. పిశాచమై మీపీక నొక్కివేయును. ఫ్రూల్‌సాహేబే కత్తితోనరికి చంపివేయును. కావున కాపాడుకొనుడు—జాగ్రత ! జాగ్రత !! ముమ్మాటికిని జాగ్రత !!!” అని యెలుగెత్తి చెప్పుచు వడివడిపోయెను.

అరిందమ్మనసున సముద్రతరంగములవలె యనుమానము విశ్వాసమును బనిచేయఁదొడఁగెను.

ఒక్కఁడు నిటులనాలోచించుచుఁ గూర్చుండ, దేవేంద్రవిజయుఁ డింకను రాలేదు. కాని యోగేంద్రనాథుఁ డరిందమ్‌బాబును దర్శింపవచ్చెను. అపుడు వీరిరువురు నొకచోటఁ గూడి పరిసంగించి ప్రసంగించి తుదకు:—

"

"యోగీంద్రనాథ్‌బాబూ! మీరుపోయి 14 జతలు మిక్కిలిబలమైన బేడీలును పది విద్యుద్యంత్రములును,—క్రొత్త తీగెలతో మిక్కిలిబలమైనదావకములతోనున్న—నాకు జరూరుగా పంపవలెను. రేపుప్రొద్దుటికి మీరు యిప్పటికైదీలను పెద్దజైలుకుపంపివేసి గదులు పదునాలుగు ఖాళీచేయించి యుంచండి."

"చిత్తము అటులనేపంపించెదను. కాని తమయింటిలో కొందరుపోలీసుజవానులు నుంచుకొనుట మంచిదేమో?"

"నాకెవరిసాయమును అక్కరలేదు. మీరుమాత్రము నేనుకోరిన వి పంపివేయండి. పోలీసుస్టేషనువద్ద నేటిరాత్రి నిండు పహరాయుంచుటకు ఏర్పాటులుచేయండి. రాత్రిభోజనముచేసికొని మీరును ఒకకానిస్టేబిల్‌యును బయలుదేరి రండి. అప్పటికి దేవేంద్రమిత్రాబాబుకూడా ఉండగలరు—"

"చిత్తము! అటులనేచేసెదను—" అనుచు యోగీంద్రబాబు సెలవుగైకొని తనయింటికి బోయెను.

అరిందమ్ విద్యుద్యంత్రముతో చేయవలసినపనినిగూర్చి యోచించుచుండ దేవేంద్రవిజయుఁ డింటికివచ్చెను.

"ఏమండీ, ఏమో యోచించుచున్నారే—విశేషము లేమిటి?" అని యడుగ, "విశేషములేమున్నవి? రేవతి యీ పదునాలుగుభువనములలో నున్నటుల గానరాదు. ఆమెనెవడో తీసుకొనిపోయెనట! యెంతప్రయత్నించినను లాభములేకున్నది!"

“ఇదియా మీకు బజారులో దొరికినభోగట్టా? కాని మరి మీరు విచారించవలసినపనిలేదు. నేటిరాత్రి రేవతి యెచ్చటనున్నది తెలియుటయు, ఫూల్‌సాహేబు మనకు నమస్కరించుటయు జరుగును.

“ఆఁ—ఏమిది ఆశ్చర్యమైనమాట!

“ఆశ్చర్యమున కేమున్నది.?” అనుచు మోహినిమాటలు, ననంతరము వీరిప్రయత్నములు, నేఁటిరాత్రి కానున్నదియు సవిస్తరముగాఁ దెలియఁజేసెను.

“మనమీరాత్రి మిక్కిలి జాగ్రత్తగా నుండవలెను. ఫూల్‌సాహేబుయోగిగారును వారిశిష్యులు నెనసి పదమువ్వురితో నాతిథ్యము నొందవచ్చుచున్నారు. వారి కాతిథ్యమీయ నర్ఘ్యపాద్యాదులు సిద్ధపరచినాను. కాని వారువచ్చినపిదప నాకు మీరు కొంచెముసాయము చేయవలసియుండును. కావున నేను మనము త్వరగాభోజనముచేసికొని మేడమీఁదనుందము” అన “సరే” అనెను. వారిరువురు నాప్రయత్నములోనే యుండిరి. ......

..................................................

స్వేచ్ఛగాఁదిరుగుచుండిన తుమ్మెదలు మెదలవీలులేని తెఱఁగున పూఁదేనెలయాసచే రానున్నకష్టము నెంచక, ముకుళించుకొనిపోవుచున్నపద్మములలో బంధింపఁబడుచున్నవి. హాయిగా మనసువచ్చినతెఱఁగునఁ దిరుగుచుండిన జంతుకోటి చీఁకటి యనుపగ్గముచే బంధింపఁబడుచున్నది. సూర్యాస్తమానమై, సంధ్యారాగంబు వన్నెఁగోలుపి, చీఁకటిపడి, కొంతతడవునకు చీఁకటి యధికమై పట్టణమంతయు మాటుమణఁగినది.

సాయంసమయమున యోగీంద్రనాథుఁ డంపిన విద్యుద్యంత్ర సామగ్రినంతయు మేడమీఁద నుంచుకొని దానితీఁగెలు క్రిందిమెట్లవఱకును వలసినయట్లుపఱపి వీధిచావడి కిరుప్రక్కలనున్న రెండుగదులలో నొకగదిలో నొకతీఁగెనుంచి యందే యోగీంద్రునుండ నియోగించి, యాతీఁగెను, మేడమీఁద తానుగూరుచుండుచోట నొకచిన్నగంటకు సంధించి యచటఁ దానును దేవేంద్రుఁడును చాలతడవు "దశావతారీ" (గంజీబా) నాడుచుండిరి. ఈ మేడకు ముప్పదియాఱుమెట్లు. మెట్లకావంతయు నవకాశముపదలక తీఁగెలచేనింపి యంత్రములలో వేయవలసినయామ్లములు వేసి తీఁగెలకనుమంత విద్యుచ్ఛక్తిఁ గలుగఁజేసి, దేవేంద్రవిజయుని పదిమెట్లుదిగుమని కోరెను. ఆప్రకార మాతఁడు పదిమెట్లవఱకు క్రిందికినడువ, తనకాళ్ళుచిప్పునలాగుకొని పోవుచుండ భరింపలేక "మొఱ్ఱో, మొఱ్ఱో" యని కేకలువేసెను.

"హా—ఇదియే శక్తి—ఇదియే కావలెను. ఇక చాలును—" అనుచు నరేంకమ్ తీఁగెలసంధిని యంత్రమునుండి వీడఁదీసి, తిరుగ తనకడకురమ్మనెను.

ఆసంధివిడఁదీసినతోడనే యేవిదేశమేగెనో కాని యాశక్తి యంతయు మఱియెచ్చటను గానరాలేదు. పిమ్మట వీరిరువురును చేతులకును గాళ్ళకును రబ్బరుదుస్తులే ధరియించి వీధిచావడిప్రక్కగదిలో యోగీంద్రునునిచి, దొంగలయలుకుడు కాగానే తీఁగెను కదుపసెలవొసంగి, జాగ్రత్తతోనుండ నియోగించి తామిరువురును దిగుగ నాడుకొనుచుండిరి. అరీంద మొసఁగిన యాజ్ఞననుసరించి ఠాణాలో పోలీసువారు మేల్కొని పహరా

యిచ్చుచుండిరి. ఆయుధములన్నియు సిద్ధముగ నుంచుకొనిరి.

అరిందమ్‌గారియింటికి బయలనున్న పెద్దమామిడితోఁటలో నక్కడక్కడగల పక్షులయలుకుడు తప్ప అప్పటినిశ్శబ్దమునకు భంగకారి యింకొకటి లేదు. అరిందమ్‌గారిసెలవుప్రకారము వారిబంగాళా కెదుటనున్న పెద్దదీప మార్పఁబడియున్నందున కచేరీచావడిలోఁ గూడ మిక్కిలి చీఁకటిగానుండెను. రాత్రి పదునొకండు మించినది. గంజీబాయాటలో మిక్కిలి యాసక్తులయి దేవేంద్రవిజయుఁడును అరిందమ్‌బాబు నాడుచుండిరి. అరిందమ్‌బాబు ప్రక్కనే జోడుగుళ్ళబారు దట్టింపఁబడియున్నది. యోగీంద్రబాబుపంపిన బలమైన పదునాలుగుజతలబేడీలును జూచి దేవేంద్రుఁడు "సరేకాని వచ్చెవారు పదమువ్వురేయుంటిరే. పదునాలుగుజతలేల బేడిలు?" అనియడిగెను.

"అనుచరులతో కలుపుకొని ఫూల్‌సాహేబుపదమూడవవాఁడు కదా! కనుక పదమూఁడుబేడిలును అవసరమే. ఇక మిగిలినదియొకటియు జుమీలియాకూడా వచ్చినచో నదియామె కుపయోగించును. కానిచో, ఫూల్‌సాహేబునకే రెండునువేసెదను—"

"సరే"

అంత, వీథిగుమ్మమువద్దకు ననుచరసమేతముగఁ బూల్‌సాహేబు వచ్చి, చావడిలోనుండి కచేరీవసారాలోనికిఁ, బిమ్మట, గదులుదాఁటి మేడమెట్లవద్దకుఁ బోవుచుండగా వీరికాల్నడకయలుకుడువిని యోగీంద్రునిసంజ్ఞ నంది యరిందమ్ పోల్చి తనవిద్యుద్యంత్రమునకు జాగుకుఁ గలిగించుచుండెను. అరిందమ్ దేవేంద్ర

విజయు లాటఁగట్టి పెట్టి జాగ్రత్త పడి వారివారితుపాకులతో సిద్ధ ముగనుండిరి.

ఫూల్ సాహేబును తక్కినపండ్రెండుగురును మేడమెట్లె క్కిరి. ఇంకెవ్వరును మేడమెట్లకు క్రింద లేరని తెలియుసరికి విద్యుచ్ఛక్తియంత్రములకు మీఁటలేసి పనియిచ్చి చురుకుఁగలిగించెను. ఫూల్ సాహేబు పదునాల్గవమెట్టునెక్కినప్పటికి చివరివాఁడు రెం డవమెట్టెక్కెను.

చివరివాఁడు రెండవమెట్టు నెక్కినపిదప యోగీంద్రనాథ్ త్రిరుగ తీఁగెనులాగుచు సంజ్ఞనిచ్చెను. మెట్లపై నావంతయు తె రపిలేకుండ నీవిద్యుత్తంత్రములచే నింపివేసియుండిన వీరికి బాధగలి గినపుడు ప్రక్కలకుఁబోదమన్నను నంతయుఁ దంత్రములమయమే. విద్యుచ్ఛక్తి బహుదుర్భరమై యుండెను. ఫూల్ సాహేబు నో టమాట లేక, పొందుచుండిన బాధ కట్టెటులనో యోర్చికొనుచు మెలమెల్లగ నెక్కుచుండెనే కాని తనయనుచరులుమాత్ర మా వంతయు నావంత నోర్వఁజాలక రోదనము చేయుచుండిరి. విద్యు చ్ఛక్తి వృద్ధియగుచుండెను. ఆత్మగౌరవమునకు లోపము గలు గుననియో, తనయనుచరులయెదుట తనకు న్యూనత గలుగున నియో తన "బహదూర్"కు లోపముగలుగుననియో, కాక యిం కేకారణముననో గాని, ఫూల్ సాహే బింతవఱకు నెట్టెటుల నో యోర్చియున్నాఁడు. కాని మఱి యోర్వఁజాలకున్నాఁడు. గ్రు డ్ల నీరు గ్రుక్కుచుండెను. అయ్యును నోరుమాత్రము విడివడలేదు.

ఇదియంతయుఁ గనిపెట్టి అరిందమ్ చేతనొక లాంతరు గొని, తన వెంట తనవలెనే దుస్తులధరించి చేతఁ బదునాలుగుజత

లబేడీలు పట్టుకొని దేవేంద్రుఁడు నడువ మెల్లమెల్లన మెట్లుదిగి, తాను లాంతరు క్రిందికిఁ జూపుచు ఫూల్సాహేబున కెదుట నిలిచెను. దేవేంద్రవిజయుఁడు పంద్రెండుగు రనుచరులకడకు వచ్చి బేడీలువేసెను. ఇంక బేడీలు వేయించుకొనుటకు సిద్ధముగా నున్నవాఁ డొక్క-ఫూల్సాహేబుమాత్రమే—అరీందమ్ రెండు జతలబేడీలను బట్టుకొని ఫూల్సాహేబునకుఁ గూడ దుదకు బేడీలువేయసిద్ధుఁడై యెదుటనిలిచి, "ఓహో, ఫూల్సాహేబు డాక్టరుబాబ్జీ! క్షేమమా! ఈనాటికి మిమ్ములను నాగ్రహపావనార్థము రా గనులపండువౌ తెరంగున గాంచితిని. నేను మిక్కిలి సుదినమని యొగతాళిజేసెను.

ఫూల్సాహేబు మారుపలుకలేదు.

కనులు చింతనిప్పులయ్యెను.

మొగము నెత్తురుకగడయ్యెను.

పండ్లు పటపటఁగొరుకుచుండెను.

మెట్లమీఁదఁ గొందరుగంతులువైచుచు, నింకఁగొందరు నేలవ్రాలి తన్నుకొనుచు నానావిధవికారచేష్టలుఁ జేయుచు, వారివారిచేతులఁగల కత్తుల నేలవీడి, బహువిధములఁ బరితపించుచుండిరి.

ఫూల్సాహేబుమాత్రము చేతికత్తిని వీడలేదు.

"మీచేతనున్న యాకత్తి నిట బారవైచినచో మీతో కొన్ని సంగతులు మాట్లాడవలసియున్నది—" అనినతోడనే యాతఁ డేమియెంచెనోకాని కత్తిని నేలనెత్తివేసి, తనచేతులు బేడీలకొసఁగ నరీందమ్ స్వంతముగానే యాతనికి

బేడీలువేసి తాణాకు బోయి యాయుధపాణులైన పె
క్కండ్రుపోలీసుజవానులఁ దీసుకరా దేవేంద్రవిజయు
నంపెను.

అనంతర మీాక్రిందిసంభాషణ మరీందమ్‌ఫూల్‌సాహేబు
లకు జరిగెను.

"నే నడుగబోవుప్రశ్నముల కెల్ల సదుత్తరముల నిచ్చుచుండ
వలెను"

ఫూల్‌సాహేబు మారుత్తరువీయలేదు. క్రోధాగ్ని కను
లనుండి వెలువడుచుండెను.

"ఏమి! మానమూని యర్థాంగీకారము వెలువరచిన నదిచాల
దు. చక్కగ మాటలాడవలెను—"

"అరీందమ్! ఇప్పుడు నీపని యిటులనున్నది. ఫూల్‌సాహేబు
సింహము బోనులో చిక్కుకున్నది. ఇంక చేయవలసినది
లేదు. కాని—కాని! ఏమియడుగదలంచినావో అ
డుగుము"

"కేశవచంద్ యెవరు? నీమొదటిపేరేమి? పోలీసుస్టేషనుకొక
కన్నెను చంపి పెట్టెలోబెట్టి పంపినది నీవేనా? జుమాలి
యాకును నీకును యెట్టిసంబంధము? ఇన్నిపనులుచేసిన
వాడెవడు—మోహినియెవతె?"

"————ఆఁ——ఎవరు? మోహినియా? నీకెటులదెలిసినది? అ
బ్బబ్బా! యెంతపనియైపోయినది. తొలినుండియు నా
కు మృత్యుదేవతయైన యామోహినియే నీతో నన్ని

సంగతులును చెప్పకపోయియేయుండినచో ఇప్పుడు నేనీ తీగెలమీఁదపొందుచుండిన బాధ, నాయాత్మ పడుచుండిన దుఃఖము, అంతయు పొందవలసినవాఁడవు నీవేకదా! అన్నన్నా యెంతపనిజరిగినది? సింహము బోనులోపడిన తరువాత నింకేమిసేయఁగలదు" అనుచు విచారించుచుండెను.

"ఇప్పు డాగతజలసేతుబంధనము కేమిగాని నేనడిగిన సంగతులకు జవాబుచెప్పుము.

"కేశవచంద్ర యెవరో మొదటచెప్పుము" అని యార్ందన్ గట్టిగానడిగెను.

అంత పూల్ సాహేబు తెంపరితనమూని క్రోధావేశముచే నోడఁదెలియక, "ఇంక చల్లకువచ్చి ముంతదాఁచనేల! అడిగితివికాన చెప్పుచున్నాను. వినుము.

అల్లాబాదుపట్టణపుబీదబ్రాహ్మణుని కుమారుఁడను. నా పేరు బిస్నాత్ లాల్ చటోపాధ్యాయి. నన్నందరు బడాఖూసీదార్ బిస్నాత్ లాల్ చటోపాధ్యాయి యని గౌరవనామముతో పిలచినచో నెక్కువసంతోషముగా నుండియుందును. నాతలిదండ్రులు నాపసితనముననే గతించిరి. పిమ్మట సాముచేయుగరిడీలతో దేశాటనము చేసిచేసి, తుదకు తిరుగ నల్లాబాదుచేరితిని. అప్పటికి గతభర్తృకయై, మిక్కిలి యౌవనములోనుండి, మిగుల రూపసియై, లెక్కలేనంత యాస్తిగలిగియుండిన మోహినిని

చేపట్టి, పిమ్మట నామెతండ్రిని, పినతండ్రిని, మామను, మఱియు
నన్నునుగూడ నొక్కరాత్రి చిత్రవధగావించిన వాడే వీడు
పిమ్మట, కాన్పూర్, పాట్నా, జబల్
పూర్, మూర్షిదాబాద్ ప్రదేశములలో తొమ్మం
డుగురుపోలీసు ఉద్యోగస్తులను కూనీచేసిన వాడే వీడు
అనంతరము తురకవేషముతో నొక
తురక దానిని "నీకా" జేసుకొనిన వాడే వీడు
కేవలము ధనకాంక్షచేతనే దానిని
పెండ్లాడుటచేత, దానిచేతనున్న ధనమంతయు
వ్రియపెట్టబడిన పిమ్మట నాకారణమున దానిని,
దానితండ్రితోపా టొక్కసారిగనే నరకివేసిన వాడే వీడు
అనంతరము గుల్సుమ్‌యొక్క మూర
టి తల్లిని గలిసి యామెను తృప్తి జెందించిన వాడే వీడు
రోహిణిని చంపి ప్రఖ్యాతి గాంచిన వాడే వీడు
జైలు నుండి తప్పించుకొని కావలి
యున్న యిద్దరు పోలీసు సిపాయిలను చంపిన వాడే వీడు
ఇప్పటికి యిరువదియు, పూర్తిగానైనవి కావు
అనుకున్న రెండుముఖ్యమైనకూనీలు కాలేదు.
నిజముచెప్పెద వినుము.

హత్య కాబడవలసినవారిలో, ముఖ్యుడవు నీవు. తరు
వాత మోగింద్రబాబు. కనుక నాయుత్తరములో నిరువదికూనీ
లని వ్రాసియుంటిని. ఏమి వ్రాసియుండిన నేమి? ఏమిచేసిన నేమి?

అనుకున్నపని కాలేదు. కాని అరిందమ్ తనహోదాకు ఫసందు కానిపనిన్ని, తనతలకు తగనిపనిన్ని, చేసినాడు. బలవంతుడగు నొకప్రఖ్యాతపురుషుఁ డొకయబలసాయము నొందనిదే నన్ను పట్టలేకపోవుట కడుశోచనీయము కాదా !!!

ఇట్లు సంతోషపు మాటలాడుచుండ తానేదారును, కొంత మంది పోలీసుజవానులును వచ్చిచేరిరి. బేడీలు వేయఁబడిన పంద్రెం డుగురు దోఁపిడిగాండ్రను ఠాణాకు దీసుకపోఁబడుచుండఁ ద్రోవ లోనొక తెరయొక్క చెట్టుఁపడగి, దయాలువ, నీగుంపులోఁజొరఁబడి కనిపెట్టి, మరల నేలకొరిగి వేగముగఁ బరువెత్తి, తనను వెదకనెంచినవా రికి దుర్లభమై, యీపోలీసువారెంత వెదకినను మఱి కానరాలేదు. ఈద్రోహులంతో వెళ్ళిన తానేదారు ఠాణాలోనే యుండిపోయెను.

అరిందమ్‌తోఁ ఫ్రూల్‌సాహేబు చెప్పవలసినమాటలన్ని యుఁ జెప్పిచెప్పి "అరిందమ్! నీదర్జాకు తగనికుట్రపని చేసినా వు. నీకది ఫసందు కాదు. కాని నా ప్రియురాలు జుమీలియావ లన నీకు ప్రాణాపాయము కలుగకపోయెను. జుమీలియాను ప ట్టుకొనుట ఫ్రూల్‌సాహేబును పట్టుకొనుట కాదు. అదిమాత్రము తెలిసికొనియుండుము" అనుచు బూల్‌సాహేబు విద్యుద్యంత్ర శక్తకని విద్యుచ్ఛణకుల చురుకుఁదనమునకు నోర్వఁజాలక మిక్కిలి బాధపడుచు, "నాపాలిట మృత్యుదేవతయైన మోహిని, నీపా లిటి యిష్టదేవతయైనది——" అని దీర్ఘోచ్ఛ్వాసము విడచెను.

అరిందమ్ మారునలుకక దేవేంద్రవిజయుని ముందున నుపుమని ఫ్రూల్‌సాహేబును ఠాణాకునడుప నాజ్ఞనిచ్చి తాను వెనుకనడుచుచు, ముగ్గురును, పోలీసుస్టేషనుకుఁ బోవుచుండిరి.

తూర్పురేఖలు పారుచుండెను. చల్లని పిల్లగాలులు వీచుచుండెను. పక్షులు మేఁతలకొఱకు స్వేచ్ఛగా విహరించుచుఁ బోవుచుండెను. వీరు పోవుచుండిన నూమిడిశోఁటలోఁ జెట్లమీఁద కోయిలలు కుహూకారములు సేయుచుండెను.

ఆతోఁటలోనుండి వీరుమువ్వురును గొంతదూరము నడచుసరికి యొకయుబల రివ్వునవచ్చి తనచేతనున్న

## కత్తితో ఫూల్సాహేబుకడుపుమీఁద పొడిచి

"ఈనాటికి మనయిరువురియాత్మలకును శాంతిని గలుగఁజేసిన దీకత్తియే. మఱచితివే మోహనన్నా. కొంతకాలము నీకు మోహినీదేవతనై యుండిన మృత్యుదేవతనుసుమా? అరిందమ్! జుమీలియా బ్రతికియున్నంతకాలమును నీకు నపాయము లుండఁనేయున్నవి. జాగ్రత్త" యని యనుచు దనకుఁదానే పొడుచుకొని నేలపై వ్రాలెను.

వీరిరువుర శరీరములనుండియుఁ బ్రవహించురక్తమునకుమేర లేదు. దేవేంద్రవిజయుఁడును అరిందమ్‌యును బ్రతికియుండిన మోహినిని బట్టనెంచిరేకాని తుదకు విఫలమనోరథులైరి.

మోహినీఫూల్సాహేబులు మృతులై పడియున్నస్థలమునకును ఠాణాకును నెంతోదూరము లేదు.

మోహినీఫూల్సాహేబులమృతకళేబరములు ఠాణాకుఁ బంపఁబడినపిమ్మట విధులప్రకారము కార్యక్రమము జరుపఁబడెను.

సూర్యోదయమై చాలసేపైనది. అరిందమ్ పూల్సాహేబుమనుష్యులను దీయించి జాగ్రత్తపెట్టించుటలో నాతనియంగీలో విషసంబంధమగుముండ్లు రెండును ఉత్తరములుకొన్నియు దొరకెను. ఆయుత్తరము లరిందమ్ చదివిచూచి, " దేవేంద్రవిజయ ! యోగేంద్రబాబూ ! ద్రోహి చచ్చిపోయినాడన్న సంతోషమును మనకీయుత్తరములు దొరకకపోయినయెడల పొందజాలముసుమా!" అని యనుచు నరిందమ్ తనయింటికిబోయెను. దేవేంద్రవిజయుడును అరిందమ్గారియింటికే పోయెను.

యోగేంద్రబాబు వ్రాసికొనవలసిన రిపోర్టులు వ్రాసికొని పిమ్మట తనయింటికిబోయెను.

మోహినీపూల్సాహేబులహూషపత్రములు ఠాణాలో భద్రపరుపబడెను.

# వాఁడే వీఁడు.

## ఇరువదియైదవ ప్రకరణము.

### కంకణధారణ

ఫూల్‌సాహేబు మరణించుటయను లోకోపకారకార్యము జరిగిననాఁటిసాయంసమయమున చల్లగాలికై తనయింటివీధిచావడి లోఁ గూర్చుండి, అరిందమ్‌బాబు, యేమో యోజించుచుండ దేవేంద్రవిజయమిత్తర్ బాబువచ్చి, "ఇక్కడి కిన్నినాళ్ళయినది. ద్రోహి పట్టుబడి మృతుడైనాఁడు. వలసినంతఖ్యాతి దొరకినది. ఇంక నేనుండి చేయవలసినపని యేమున్నది? నేను మా యింటికిపోవుటకు సెలవు దయచేయగోరుచున్నాను."

"ఏమి మీకింతతొందర? మీకు జరూరుపనులున్నవా యేమి"

"జరూరుపనులకేమున్నది?"

"మీస్వంతపనులున్నను లేకున్నను మఱిమీఁదనున్న పెద్దభారము దలంపకున్నారుగదా?"

"ఇంకేమిభారమున్నది. మీకున్న పెద్దభారము తీరినదిగదా?"

"ఇంకేమిభారమున్నదా? ఉన్నభారమే ముందున్నది!"

"ఇంకను ముందేమున్నది? ఇంకొకఫూల్‌సాహేబు పుట్టలేదుకదా!"

"లేదు కాని మననిరూపకప్రయత్నము లింకను పూర్తికాలేదు. మన మొదటియుద్దేశము సిద్ధించలేదు. రేవతి యెచ్చటనున్నదో యింకను మనకు తెలియలేదాయె. కావున మీరింతతొందరపడిన నెట్లగును?" మీరింకొకతూరి రేవతినిగూర్చి వెదకపోవలయును.

"ఏమీ! రేవతిని వెదకుట యొకపనియా. మీ కాపనియందు నంతయవసరమా?"

"మీకు కొంచెము రోషమువచ్చినటులనున్నది? రేవతిని వెదకుటయందుమీకున్నంతశ్రద్ధ మరియొందున్నను మన మింతకాల మింతశ్రమపడకపోయియుందుము. ఏదియెట్లున్నను మనమొకతూరి రేవతిపినతండ్రి గోపాల్‌చంద్ వద్దకు పోవలసియున్నది. మీరును రావలెను"

"చిత్తము. అటులనేవచ్చెదను"

"సరేకాని గోపాలచంద్ యెట్టిమనుష్యుడో మీకు తెలుసునా"

"మిక్కిలి పెద్దమనిషి. పెనకుటుంబస్థుడు. గౌరవనీయుడు. మర్యాదకలవాడు"

"మీకు లోకానుభవము లేదు"

"నేను ప్రత్యక్షముగా నతనినెరుగుదును. అతడు జమీందారులలో లెక్కగానిసామాన్యుడు కాడు"

"కనుకనే, మీకు లోకజ్ఞానములేదని యనుచున్నాను. సరేగాని మనమిద్దరముకు కలసి గోపాలచంద్ యింటికి వెళ్ళి ఆయనను దర్శించివచ్చెదము. దయచేయండి."

"చిత్రము. జేనిమాద్‌పూర్‌లోనున్న యాయనయిల్లు నేనెరుగుదును. ఆయనయన్నకూఁతురును, మనచే నిపుడన్వేషింపబడుచున్నట్టిదియు, నగు రేవతినిగూర్చిన "డిటెక్షను"లో నన్నాయన తరుచుగా పిలుచుచుండెను. రేవతినినేనును, నన్ను రేవతియు, నొండొరుల నెఱుగుదుము. పాప మామె కానరానప్పటినుండియు నాయనకు మతిస్తిమితము లేదు."

"సరే—ఆయననుచూచి మనము రేవతినిగూర్చి తెలిసికొనవలసిన భోగట్టానంతయు తెలిసికొనినచో మనప్రయత్నములలో నాభోగట్టాయును సాయమొనర్చగలదు. కనుక మన మీవేకువనే లేచి బేనిమాద్‌పూర్ పోవుదము" అని మఱికొంతసేపేమేమొ మాట్లాడుకొని మరునాఁడు వరువాత చల్లనిపిల్లగాలులు వీచుచుండఁ బయనమైపోయి బేనిమాద్‌పూర్ చేరిరి. దేవేంద్రబాబు గోపాల్‌గారియిల్లెఱిఁగినవాఁడే యాటచేత నరేంద్రబాబును దీసికొని వారియింటికిఁ బోయి కావలిభటుల చేత జమీందారుగారికిఁ దెలియఁజేయ నాయన బయటికి వచ్చి వీరిరువురిని లోనికిఁ దీసికపోయి యుచితాసనములిచ్చి కుశలప్రశ్నములు చేయుచుండెను. గోపాల్‌చంద్‌గారివయస్సు నలువదియెనిమిది సంవత్సరములకు తక్కువదై యుండదు.
రమెరుపు, కాయముస్థూలమై దృఢమై యుండెను. తల
డ్రుకలుకురచగాఁ గత్తిరింపఁబడియుండెను. మీసముగాని
ముగాని లేదు. మెడలో తులసిమాలికలును, చేతనొక తులసి
ళతావళమును ధరించియుండెను. ఇతనినిగోపాలదాసనియుఁ

బిలుచువాఁడుకకలదు. ఇతనియింటితలుపులమీఁద హిందీభాషలో

"గోపాల్ దాస్ దైవభక్తుఁడు"

అని రంగురంగులతో వ్రాయఁబడియుండెను. వివిధములయిన జనసమూహములుగల యీపృథ్వియందు గోముఖవ్యాఘ్రము లు పెక్కురుండవచ్చునుగదా !

" నాయొక్క కష్టము విని నన్నోదార్పవచ్చినారుగాబోలు విజయాబాబూ?—మీరెవరు?—"

" ఈయన మాయజమాని. మిమ్ములను జూచి పోవచ్చినాము"

" అటులనా? ఏమిటో—శరీరమంతయు కష్టములతో చిల్లులు వడియున్నది. మీరెఱుగనిదా మాకుటుంబము? అన్న గారు కాలముచేసినాఁడు. పోనీకదాయని యీయనకు మారుగా నాయనని తానీలుగా భావించుచు ఉంచుకొనివచ్చుచున్న యీయనయిరువురికుమార్తెలు రేవతీ రోహిణులను యేదోద్రోహియో, యేమిద్రోహో, యేదుర్మార్గుఁడో యపహరించినాఁడు. నాకు సమస్తమును వారేయని నమ్మియుండినవారి నెవఁడో తీసుకొనిపోయి నాకడుపున చిచ్చుపెట్టినాఁడు."

అర్థం—శుద్ధశ్రోత్రియులకును, ధర్మాత్ములకును, దైవభక్తపరాయణులకును, మాత్రమే యాభగవంతు డిక్కట్టుల గల్పించుచు వారిని పరీక్షించుచుండును.

గోపాల్—హేకృష్ణ! హేకృష్ణ!!
రాధారమణ! రాధారమణ!!

అరీం—దుఃఖించిన కార్యములేదు! ఇంతకీ కానరానివారినిగూర్చి మనము కనుగొనఁ బ్రయత్నములు సలుపవలెను. కాని యిటులనూరకుండి దుఃఖించుచుండుట పురుష ధర్మముకాదు.

గోపాల్—ఊరకలేదు. దేవేంద్రబాబుతో పలుమారు చెప్పియుంటిని. తుద కెట్టిలాభమును లేకపోయెను.

అరీం—సరేకాని యీసారి నేనును, దేవేంద్రబాబును, బయలుదేరి వెళ్లి కార్యము సఫలముచేసుకొని వచ్చెదము. మాపనికష్టమును మీరాలోచించి వాగ్దానముచేయ వలెను.

గోపాల్—ఇందులో వాగ్దానమున కేమియున్నది. నాకుమా తెకాల నేనతీగోహారములను నాకువప్పగించినపిమ్మట మీ యిష్టమువచ్చినది మీరుపుచ్చుకోవచ్చును.

అరీం—అటుగాదటుగాదు. ఇప్పుడే స్థిరపడవలెను.

గోపాల్—సరే మీ కేమికోరెదరు?

అరీం—కోరుట కేమున్నది? ఇరువురుకుమా తెకాలను తెచ్చినచో తలకొక వెయ్యిరూపాయలచొప్పున నాకు బహుమానమియ్యవలెను.

గోపాల్—అబ్బా! దాహమునకు మితియుండవలెను. గొంతుకకు ముడియుండవలెను. కొంచెము తగ్గండి.

అరీం—మీరు కొంచము శాంతించుడి! కనుపడని రెండుప్రాణములు గనుపరచిన, నేనడిగినంతసొమ్మిచ్చుటకు మీ కేమికష్టమున్నది?

గోపాల్ చంద్రుఁడించుక యోజించి “ రోహిణితో పాటు రేవతిని తెచ్చినను, రోహిణినిమాత్రమే తెచ్చినను మీరడిగిన రెండువేలును యిచ్చివేయుదును. రేవతినిమాత్రమే తెచ్చినచో నూరురూపాయలుమాత్రమే యిచ్చెదను.

అరిం—ఇరుపురుషులుమాత్రలును రెండుకండ్లవంటివారుకదా ! వారియెడల మీకున్న ప్రేమ, యందలివ్యత్యాసములును, మీకున్న పక్షపాతమునున్నా, తెలియజేయుచున్నారేమి ? ఇరుపురియెడలను ప్రేమ సమానముగనుండవలెనుకదా !

గోపాల్—నా మనస్సులోనున్నమాట నేను చెప్పినాను. పైని మీచిత్తము.

అరిం—సరే ఆప్రకారము స్వహస్తముతో లిఖితపూర్వకముగా కట్టుదిట్టములు జరుగవలెను.

గోపాల్—లిఖితపూర్వకములేల ? నామాటలే లిఖితములు.

అరిం—సరే. అందుకు సందేహములేదు, కాని, యెందుకయినా మంచిదికాదూ! వ్రాసియుంచడం అన్నివిధాల నాకుబలంగాదా?

గోపాల్—అందు కభ్యంతరంలేదు.

అనుచు నరిందమ్ చెప్పుచుండిన ప్రకారము గోపాల్ చంద్రబాబు వ్రాసి సంతకముచేసి యిచ్చెను. అరింద మదితీసికొని తనజేబులోనుంచుకొని గోపాల్ చంద్రుని జూచుచు— “ అయ్యా ! గోపాల్ చంద్రబాబుగారూ ! ఇంక నేను మీతాలూకు కేసు కనుక్కోవడంలో మీతరఫుడిటెక్టివ్ గా పనిచేయుటకు ప్రారంభించెదను—” అనెను.

"ఆహా! ఏదోనాయనా! ఎంతశ్రమైనాపడి నారోహిణిని నా కళ్ళయెదుటబెట్టి, నన్నెలాగయినా యొకయొడ్డున వేయు భారము మీదే!"

"ఆహా! ముఖ్యముగా! అన్నిటికన్నముందుగా మీయిల్లు తనిఖీ చేయవలసియున్నది"

"మాయిల్లే తనిఖీయా! మాయింట్లో యేమిటియుండును? ఏదియేలాగుననున్నను నాపిల్లలను నాయింట్లోనేవుంచుకొని లేదని మిమ్ములను వెసుకమందునా"

అరీం—అటుగాదటుగాదు. డిటెక్టివ్ ప్రారంభించినది మొదలిదియనక నదియనక పరిశోధన చేయవలెను. ఇంతకును, మీయిల్లునాల్గుమూలలును పోయి చూచినందువలన మీకుగలుగునష్టమేమిటి?

గోపాల్—నష్టమేమియు లేదుగాని, కార్యములేనిపనికి మీరిటుల తంటాలుపెట్టదలంచి ప్రయత్నములుచేయుట న్యాయముకాదు.

అరీం—ఇందులో తంటాలేమీ లేవు. నేను మీగదులు మేడలు వెదకను. ఇంటిస్త్రీలను పైకిపంపించివేయనవసరము లేదు. నేనొకపర్యాయము మీయింటిపొడుపువెడల్పులు చూడవలయును. ఇందేమి చిన్నతనమున్నదిమీకు?

గోపాల్—ఇందులో నాకు చిన్నతనముగాని తంటాగాని యేమిన్నీ లేదు. కాని లాభములేనిపనియెందుకు?

అరీం—ఇందున్నలాభము మీకంతవేగముగా తెలియనేరదు. నేను కనుపర్చెదను—

గోపాల్—అట్లయిన బాబుగారూ దయచేయండి!

అనిపిలువ, వీరిరువురును,—దేవేంద్రవిజయుఁడు వెనుక నడువ,—యింటిలోనికి తనిఖీనిమిత్తము పోయిరి.

ఇంటిలో ముందుగా గోపాల్ చంద్రుఁడు నడువ, వెనుక వీరిరువురును గొంతదూరము పోయినపిదప, పెరటిలోనున్న పూలచెట్లనుజూచి మనముకలదని యరీంద్ర మనుచు, పూలచెట్ల వైపు పోయి, నిలచి, పెరడంతయు నొక్కసారి కలయంజూచెను. ఈతఁడు పెరటిపై నిఘానుంచినది మొదలు గోపాల్ చంద్ర మోమున వివర్ణత్వ మారంభించినది.

కొంచెమైనసే పూరకుండి,—"ఏమండీ! బాబుగారూ! మీరు చాలాధనం వ్రియంచేసి, చాలా శ్రమపడి, యివన్నీ సంపాదించియుందురు—"

"ఔనండీ! దేశదేశాలనుండి తెప్పించినాను"

"దయచేసి నా కల్లదిగో ఆగులాబీమొక్క యిప్పించెదరా?"

గోపాల్ చంద్రునిగుండియలు దడదడఁ గొట్టుకొనసాగెను.

"అది యింకా చాలాలేతది మొన్న మొన్ననే బెంగుళూరునుండి చాలా శ్రమపడి తెప్పించినాను."

"అవును మిక్కిలిగొప్పజాతిది—"అనుచు నరీంద్రమ్ మెలమెల్లగా నాగులాబీమొక్కకడకుఁ బోయి దానిచుట్టునున్న చిన్నచిన్న యితరమొక్క లూడఁదీయుచుండెను.

"ఎందుకీశ్రమ" యని దేవేంద్రవిజయుఁడు దలంచుచుండెను.

పలకోగాని చంద్రాబాబుమోము వివర్ణమై, యించుకతడవైన నచట నాగఁజాలకగాఁబోలు వెనుకంజ వేయుచుండెను.

అరీందమ్ కనిపెట్టి దేవేంద్రబాబునకుఁ గనుసైగఁజేసి, తటాలున నాగులాబీమొక్క లాగివేసెను.

చంద్రాబాబుమొడ ల్గంపమెత్తెను. ముచ్చెమటలు బోయుచుండెను. మెలమెల్లగ వెనుకకు నడచుచుండెను.

అదిచూచి దేవేంద్రవిజయబాబు జల్దుకొని జాగ్రత్తగానుండెను.

అరీందంబాబు తనచేతనున్నకఱ్ఱతో నామొత్తనిజాగాను బాగా త్రివ్వితివ్వి, తనకేమికనుపించినదోకాని, "గోపాల్ చంద్ బాబూ! ఇదియేమో మీకుతెలుసునా" అనెను.

గోపాల్ చంద్ మారువలుకలేదు.

అరీందమ్, ఆజాగాను త్రివ్వి, యొకమానవహస్తము, బయటకుఁదీసెను.

ఇయ్యది కేవల మెమ్ములపోకయేగాని, చర్మముగాని మాంసముగాని అందులేవు. వ్రేళ్ళయెముకలన్నియు సమముగానుండెను. అరీందమ్ దానిని బాగాపరిశోధించి, తన కేమికానవచ్చి యంతయానంద మొదవఁజేసెనోగాని, "బాబ్ రే! బాబు!!" అనియఱచి చివాలున లేచి నిలచి, చంద్ బాబుదెస క్రోర చూపులువిగిడ్చి పండ్లు పటపటఁగొరుకుచు, "ఏమండీ మాటలాడకున్నారు?" అనియడుగ నాతఁడు, నోటితడియార, వెడచూపులతో, వెలితినవ్వులతో, "అరే! యిదేమిది? ఈయెముకలెటనుండివచ్చినవి? ఎవరో మనిషిచెయ్యిలాగున నున్నదే? హరేగోవింద్! హరేగోవింద్!! హరే—హరే!!! అనుచ నాశ్చర్యము నభినయించుచుండెను.

అరిం—తమరుతప్ప యింకెవ్వరీపనికికర్తలు? ఇన్నాళ్ళనుండియు మమ్మాదించుచు సంతసించుచున్నారు మీరే! మీరు చేయుసంగతి తెలుసునా తెలియదా? దాచక చెప్పండి!

గోపాల్—హరేగోవింద్! రామనారాయణ!! నాకేమిన్ని తెలియదు. పెనుగదాయని పూలచెట్లు వేయుకొంటినేకాని యింత అంతకం వుందని నేనెరుగకపోతిని. ఏమియాశ్చర్యము జరిగింది! రాధేకృష్ణ! రాధేకృష్ణ!! రాధేకృష్ణ!!! పాపము శాంతించునుగాక! హరే!!

అరిం—అబ్బా! పాపము మీకింతయాశ్చర్యమైనపని జరిగింది గనుకనే యికనొకనిముషమైన నాలస్యము సేయకుండ, మీహస్తములకు కింకణధారణ యగుచున్నది," అనుచు నాతని రెండుచేతులును గలిపి బేడీలువేసి యెదుటనిలువ నిక్రిందిసంభాషణ జరిగెను.

గోపాల్—అరిందమ్‌బాబూ ఆర్తులైనవారిపాలిటి కామధేనువవై, నావాడవై యున్న నీవే నన్నిటుల బాధించుచున్నావేల?

అరిం—నేనెల్లప్పుడును మీవాడనే—కాని యెవరపరాధులో వారికిమాత్రమిటుల మర్యాదచేయుట యీదేశాచారమైయున్నది.

గోపాల్—ఐతే యిప్పుడు మీమాటలనుబట్టి చూడగా మీరు నన్ను ద్రోహిగా భావించినటుల దోచుచున్నది. అయితే నటుల మీరు తలంచుటకు, తగినప్రమాణమేమున్నది?"

అత్యుగ్రమగు మాత్సర్యక్రోధములవలన, గోపాల్‌బాబుగారికెమో మరుణిమవహించి, దేహమెల్ల కంపముఁనందెను.

అరిం—ప్రమాణమా? అది నాయొద్దనేయున్నది.

గోపాల్‌చాంద్‌గారికి సంశయము వృద్ధియై తనను దానే నమ్మఁజాలక పోవుచుండెను. చంద్రాబాబుగా రచట నిలువ లేనంత, శరీరము నణఁకఁజొచ్చెను. అరిందమ్‌బాబు తన కోటు జేబులోనుండి యొకయుత్తరము పైకతీసి—" ఈదస్తూరీ మీ రిదివర కెరుంగుదురా? పోల్చఁగలరా?" అనియడిగెను.

" అదియేమో? యెవరిదో? నాకేమితెలుసును. నేనిదివర కెన్నడును చూడలేదు. కనుక నేను పోల్చఁజాలను.

" ఈదస్తూరీ మీదికాదా?"

" అయ్యో! నాదేయైనయెడల, నే నేలచెప్పను? అది నాదస్తూరీకాదు"

" ఛీ బద్మాష్! బడా చోర్!!—చాలు, చాలు. నోరుమూసుకోవయ్యా! ఈయుత్తరమునందున్న సంతక మెవరిది?"

"అది నాసంతకమునే పోలియున్నది. కానినాదస్తూరీకాదు—"

" సరే పోనీకాని, యీదస్తూరీకిన్నీ యీయుత్తరపుదస్తూరీకిన్నీ భేదమేమున్నది? అనియనుచు, నిపుడిపుడే గోపాల్‌చాంద్ వ్రాసియిచ్చిన, యుత్తరము (రేవతీరోహిణులను గనిపెట్టినవారి కరిందమునకు గోపాల్‌చాంద్ బహుమతీయిచ్చెదనని వ్రాసియిచ్చిన వప్పుదలయుత్తరము) తన జేబునుండి తీసి చూపెను.

"ఆఁ—చూడండి! దానికీ దీనికీ యెంతభేదమో!"

"ఆఁ—యేమిటి! భేదమున్నది! దొరికినా యింకా దొరికలే దనేదగుల్బాజీ! క్రిందపడ్డా, మీదవాడనేయని యంటావేమి? ఈరెండుసంతకములకు, యీరెండుసంతకముల కు, భేదము కలదందువేమి? ఇప్పుడు నీవువ్రాసియిచ్చిన యీయుత్తరములలోని సంతకమునకున్నూ, యీవెను కటియుత్తరములోని సంతకమునకున్నూ భేదము కలదం దువేల?"

"అయ్యా! మీరుమాటలు మిక్కిలి ముదరబెట్టుచున్నారు— అది నాసంతకంకాదు! అది నాసంతకంకాదు!! అది ఫోర్జరీ—బాగా నిదానించి ఆలోచించండి.—మీరు మొదట నాచేత వుత్తరంవ్రాయించడం, తరువాత యీ ఫోర్జరీవుత్తరం చూపడం, చూడగా మీరేదో నా కు ఘాతచేయవలెననే పెద్దద్రోహపుతలంపుతో వచ్చిన ట్లున్నది!"

"నీకన్న నేను దగుల్బాజీనికాను. ధనలోభముచేత, అన్నకు మార్తెనొకదానిని చంపించి రెండవదానిని చంప బ్రయత్నించుచున్ననీకన్న భయంకరుడనుకాను—"

దేవేంద్రవిజయుఁడు విస్మయముఁ జెందుచుండ, గోపాల్ చంద్ బసు తనక్షేమమునుగూర్చి సంశయముచేత స్తం భీభూతుఁడై నిలిచియుండ, నరేందర్‌బసూ తనజేబులో నున్నయుత్తరములను బిగ్గఱగా నిటులఁజదివెను.

(మొదటియుత్తరము.)

కేశవబాబూ!

నేటికి రెండుదినములనుంచి మీయొక్క సంగతి తెలియుచుండుటలేదు. మనపనులకు మిక్కిలి ఆటంకముగానున్నది. అందువలన నాకు విచారముగానున్నది. మీరు, యెంతత్వరలో రేవతీద్రోహులనుచంపి, ఆనిశానీలను నాకు పంపుదురో, అంతత్వరలో మీకు నేను వాగ్దత్తముచేసినయావత్తున్నూ యిచ్చివేసెదను.

ఇట్లు
మీ శ్రేయోభిలాషి
శ్రీగోపాల్‌చంద్రబసు
జమీందార్.

(రెండవయుత్తరము.)

కేశవబాబూ!

మీసౌఖ్యగారిద్వారా నేను వినినయంశములనుబట్టి చూడగా మీకు నాయందు విశ్వాసములేనట్లు బోధపడినది. కాని మీకు నమ్మకములేనందుకుసరిపడా, యీసమయములో మీకు వకదమ్మిడియైనా ముట్టదు. మొట్టమొదట పనులను నెరవేర్చవలెను. అది న్యాయము. మీవాగ్దానముప్రకారము, యెంతత్వరలో రేవతీద్రోహులనుచంపి, అందుకు నిదర్శనములనునాకు పంపుతే అంతత్వరలో మీకు, నేను వాగ్దత్తముచేసినప్రకారము ఆసొమ్ము యివ్వడమేకాకుండా మీకు వేరేబహుమతికూడా యిప్పించనిశ్చయించుకొన్నాను. కాలహరణముచేయుట నావిచార

వృద్ధిసేయుటయు, మీకానందముగలుగకుండుటయు నై యున్నది. మీయట్టిసమర్థులే యీపని నెరవేర్పలేనిచో నిక యాసలు వీడవలసినదే ! త్వరలో మీరు మనప్రయత్నము సఫలతజెందజేసి నన్నానందింపజేయ ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
మీపురాభివృద్ధి గోరువాడు
శ్రీగోపాల్ చంద్ర
జమీన్దార్.

(మూడవయుత్తరము)

కేశవబాబూ!

మిక్కిలి ఆశ్చర్యమైనసంగతి యేమనగా రోహిణిని చంపి యింతకాలమయ్యెను రేవతిని చంపలేకుండుట మీకున్నూ మీవిఖ్యాతికిన్నీ లోపము దెచ్చుచున్నది. రోహిణి చంపి దాని వామహస్తము ఆముద్దుటుంగరము తోపాటు నాకుపంపి, ఆకళేబరమును ఠాణాకుపంపి యేరీతిగా మీబహద్దూరీని నిలబెట్టుకున్నారో, అదేరీతిగా రేవతినిన్నీ చంపి దానికి తగినమంచినిదర్శనము పంపి మీకీర్తిని నాచంద్రతారకముగ నిలువబెట్టుకొనుడు—రోహిణీనిమాత్రము చంపి మీరు సగముసొమ్ము అడుగుచున్నారు. అది కేవల మన్యాయముగను, ఆశ్చర్యకరముగను యున్నది. ఏలనన ? రోహిణినిమాత్రము చంపుటవలన లాభములేదు సరిగదా నాకు మిక్కిలి అపాయకరముగనున్నది. ఒకతెనుచంపి రెండవదానిని చంపకుండుట, నాకును, మీకును అపాయకరమే !

రోహిణిని చంపి దానియెడమచేయి నాకు, దానియంగుళీయకముతోపాటు, గురుతుగా పంపిన జూచి, యత్యానందమంది, నాపెరటిలోనున్న క్రొత్తపూదోటలో నొకచోట పాతిపెట్టియయ్యదిగురుతుగా దానిపై నొకవింతతరగతిగులాబీమొక్క పాతించితిని. అది యాస్థలమహాత్వమునో లేక, నామొక్క క్రిందనున్న దానిమహాత్వముననో, కాని, నాకుపూర్తియగుతృప్తి గలుగునటుల, నయ్యది పుష్పించుచున్నది.

మీరుపంపిన రోహిణిమొక్క అంగుళీయకముకంటె ముఖ్యమైనగురుతు యింకొకటియున్నది. దానిచిన్నతనములో దానియెడమచేయి అగ్నిచేకాలిపోయినమచ్చ గురుతుగానుండుట వలన నేను సులభముగను సబబుగాను పోల్చగలిగి తృప్తిజెందినాను.

కాని రేవతివిషయములోమాత్రము దానిశిరస్సునే పంపకపోయినయెడల నేను పోల్చజాలను. కావున దయచేసి నను తృప్తిజెందింపుము.

ఇట్లు,

మీహితమునే కోరువారు

శ్రీగోపాల్ చంద్రబసు

జమీందార్.

మిక్కిలి జాగ్రత్తతో, ముందు దేవేంద్రవిజయుండు, నడచుచుండ, వెనుక సరిందమ్ నడచుచు మధ్యనుగోపాల్ చంద్రవిచారసాగరమున నీదులాడుచుండ, ఠాణాకుంజేరిరి. బేడీలతో భద్రముగా బసూగారు ఖైదుచేయంబడిరి.

అధర్మప్రవర్తకులపాట్లిటులనేగదా యుండును!



# వాఁ డే వీఁ డు



## ఇరువదియాఱవ ప్రకరణము.



### అమోఘసమావేశము.

బేనిమాధ్‌పూర్ గడబిడయంతయుఁ జల్లారినపిదప నొక నాఁ డరిందమ్ దేవేంద్రవిజయునితో రఘునాథ్‌పూర్ వెళ్ళెను. రఘునాథ్‌పూర్ అరిందమునియొక్క జన్మభూమి. అది బేనిమాధ్‌పూర్‌నకును పన్గ్లకవి నడిత్రోవనుండెను. ఆకాలములో రఘునాథ్‌పూర్‌లోనున్న తక్కిన యందఱికంటె నరిందమ్ మిక్కిలి ధనాఢ్యుఁడు. ఆయన యిల్లుకూడ మిక్కిలిగొప్పది. అట్టి రెండంతస్థుల మేడ యాయూరిలో నింకొకరికి లేదు. తన భవనమునకావల నొక పెద్దకోనేరుగలదు. ఆకోనేరునకు నలుదిక్కుల వెలగల పూలమొక్కలును విదేశవివిధఫలవృక్షములు నుండెను. ఆకోనేరు త్రవ్వించి చాలకాలముకాలేదు; కాని దానికి నీరువచ్చునాధారము పెక్కు జలచరములచే నిండియుండుటచేత నీకోనేరును జలచరపూరితమైయుండెను.

అరిందమ్‌బాబుగారికి దోపలనుబట్టుట కెంతయుల్లాసముకలదో చేపలనుబట్టుటకును, నంతె మయుల్లాసము. దేవేంద్రవిజయునిం గాంచి యరిందమ్, "అయ్యా! మీరు 'వెళ్లిపోయె

దను—వెళ్ళిపోయెదను—' అని తొందరపడుచున్నారు; కావు న నేను మీకు పక్వాన్నములతో విందుగావించవలెను. నేని ప్రుడు వేరేపనిమీద వెళ్ళుచున్నాను. మీరు వేకువనే లేచి, మనకోనేటిలో చేపలను పట్టవలెను. మంచిమంచిరకము లున్నవి. అవ్వుచెప్పక యీపని మీరుచేయవలెను" అనెను.

"సరేకాని! బజారులో నేలమనముకొనరాదు? అనవసరము గుశ్రమయేల?"

"తప్పించుకొనుట కిట్టిమాటలతో నేమిప్రయోజనము?"

"సరే తప్పించుకొనుటకుకాదు. మీరు ఆర్డరుచేసినపిదప వలనుకాదనను."

"మంచిదేకాని మీరు వేకువనే లేచి వెళ్ళి చాలాప్రొద్దెక్కువరకునుండక నైళము లేచిరండు—"

"చిత్తము—" అనుచు దేవేంద్రవిజయుఁడు మరలెను.

కొంచెముసే పటనేనిలిచి, యరీందమ్‌బాబు స్వగతముగ నిట్లనుకొనెను.

"ఇక్కడికి ఫూల్‌సాహేబుగడబిడయంతయు నంతమైనది. రోహిణియొక్క గురుతులు దొరకినవి. గుల్‌సుమ్‌సిరాజ్‌హీనులకు పెండ్లి యొనర్చితిని. రేవతిని యపాయమునుండి రక్షించితిని. గోపాల్‌చంద్‌ను జైలుఖానాకు పంపితిని. తక్కన దోహులందరును పట్టువడియేయున్నారు. కాని జుమీలియాజాడ యీవంతయు నొరకలేదు. ఇంతకును మిక్కిలిజరూరైనసంగతి యింకొకటికలదు. రేవతి, గోసాయియింటి నుండి రక్షణకాబడినపిదప, నొకనాఁడు సంభాషణాంతరమున

దేవేంద్రవిజయునెడ తనకుగలయనురాగము సూచించుచు బ్రశంసించెను. కావున నీమెమనోలత, దేవేంద్రవిజయునాపవృక్షమును చుట్టుకొనియున్నది. ఇంతియగాక దేవేంద్రవిజయుడు తననియమితకార్యములు కొనసాగింపగ, రేవతిని వెదకుకొరకు మిక్కిలియాతురమున నెంచుచుండెడివాడు. మరియు నప్పుడప్పుడు ముఖాముఖిని, 'రేవతిని వెదుకనరుగనేల? ఇతర పనుల నేల ముఖ్యముగాదలంచవలయు' ననుచు ఫ్రాల్ సాహేబు పట్టుబట్టకపూర్వమే, పలుమారు బ్రశ్నించుచుండెను. ఇంతియగాక తానదివరకు రోహిణీరేవతుల నెరుగుదుననియు, సందు రోహిణి హత్యగావింపబడెననియు, హత్యగావింపబడిన రోహిణికన్న రేవతి కడుంగడు రూపవతియనియు, నాయిర్వురలోపల రేవతిని మిక్కిలి ప్రేమించుచున్నాననియు, సూచావాచాగా దెలియజేయుచుండెను. ఇదియంతయు విమర్శింప వీరిరువురకుంగూడ, నన్యోన్యానురాగంబు గలదనియు దెలియుచుండె. కావున నీతడును అవివాహితుడేయగుట, గుల్సుమ్ సిరాజ్దీనులకువలె, వీరిరువురకు వివాహ మొనర్పవలెను — దేవేంద్రవిజయునకు రేవతి మెచ్చియున్నదో యిప్పటికిని తెలియదు. రేవతి తన చెలియలగు, రోహిణినిగూర్చి విచారించుచుండియు, తనమనోహరుడగు దేవేంద్రవిజయునిగూర్చి తనపరివారములను గుశలప్రశ్నముసేయుచుండు; కావున రేవతీదేవేంద్రవిజయుల కొకసారి సమావేశము సమకూర్చవలెను. రేవతి వేకువనే గోనేటికి స్నాన మొనరుపబోవును. అట్టిసమయమునకే దేవేంద్రవిజయుడును, చేపలుపట్టుటకు పోవును. కనుక వీర లొ

ప్రియముగఁ జూచుచుండుటచేఁగాఁబోలు నాతఁ డామెను బో ల్చుటచేతనో లేక మఱియేకారణముననో గాని యామెను స, మీపించి, "అరే! నీవు!! నీవిచ్చటికి వస్తివా? నీవు!!!"

అని యాశ్చర్యముగఁ బలికెను. ఆలలితాంగ చిరపరిచిత ముగానున్నవాక్యము నుచ్చరించిన మిత్రాబాబువంక తేఱిపారి చూచి, పూవిలుకానిపూవులవంటి, చూపుల నాతనిపైఁబఱపి, నిలిపి, యేమో చెప్పఁబోవ తలవ్రాల్చి, నేలఁజూచుచు, నొకటి, రెండుసార్లు శిరము సంకంపించి, చివాలున నిలిచి, చరచర గృహో న్ముఖయై నడచిపోవుచుండెను.

"అరే—ఈనిస్సికె యెప్పుడువచ్చినది? ఇక్కడ కెటుల రాఁగలిగెను? ఏమువింత? నేను పోల్చుకొంటినేగాని, ఆమె న న్నుఁ బోల్చుకొనినటుల దెలియకున్నది—బహుశః నన్ను పోల్చు కొనియే యుండును. కానిదో నామె నిలిచి, యేమో యాలో చింపఁబడియేమి? లజ్జానతవదనయై, శంకించుచు బోనేల? ఇ దియంతయు చూడంజూడ, నెంతయు వింతగనున్నది!

ఒకవేళ నీమె అరవిందబాబుచే రక్షితయైయుండనోపు, కాని నాఁడు అప్రతిహతంబగు నాప్రయత్నములకు లొంగక గా నరాక దాఁగియుండి నన్ను ప్రతారింప సమర్థురాలౌనా? ఏదియెట్లు న్నను పసితనము నాఁటినెయ్యంబు మరువక నాకంఠధ్వని వినినయం తనె నన్నుఁజూచి తూపులవంటిచూపుల బఱపెనుగదా! కాన నాయం దభిమానంబు తగ్గలేదు. లోకములో కొంతకాలము ఒకరినొకరు చూచుకొనకయుండిన యంతరమువరకు అన్యోన్యానురాగ బంధము బలకరమై వృద్ధియగునుగదా యింతకును యీమాట

లసందడినామె యేదిక్కునకరిగెనో తెలియరాకున్నయది. కావున నేనీమీలవేట గట్టిపెట్టి యామెపోవుదిక్కు నరయవలయును." అనుచు మిత్రాబాబామెవెంటనంటి నాలుగడుగులు నడచి యామె యరవిందముబాబుగారియింటికి కేగుటఁ గనిపెట్టి తానొకమారు త్రోవనుబోయి, కచేరీచావడిలోఁ బ్రవేశించి తనదుస్తులను మార్చుకొనుచుండ, స్నానముచేయఁబోవుచున్న యరవిందముబాబు చూచి, "ఓహో మిత్రాబాబుగారు ఏమయిన పట్టుకొనివచ్చినారా?" అని ప్రశ్నించెను. సిగ్గుచే మాటలాడక మిత్రాబాబు శిరమువంచి నిలిచియుండెను.

"ఏమి మాటలాడరేమి? మరేమైనా క్రొత్త వింతలను నిర్మాణముచేసుకొని వచ్చినారా?"

మిత్రాబాబు మిన్నకుండెను.

"ఏమీ, ఆదీర్ఘాలోచనానిమగ్నత కష్టమేమి? కాలము వ్యర్థముచేసికొనివచ్చిరా? మీరు నిరర్థకకార్యము సేయువారు కారు. నెప్పుడుపనియుక్తమైనను, మీరుమాత్రము వేరొకదా నినైన చేసుకొనియే వచ్చియుందురు."

* * * * * * * * * * * * * * * * * * * * * *

* * * * * * * * * * * * * * * * * * * * * * *

'సరే పోనీగాని, మీలవేటయేమైనది."

"——మీలవేటమాటకేమిగాని మీకొనేటిరేవునస్నానము ఒక్క యువ్వనిమిన్న ననుగాంచితిని. ఆమె రేవతీస్వరూపముధరించి వెలుంగుచున్నయది. తమకామెవృత్తాంతమేమైన దెలియునా?"

ఓహో, మిత్రాబాబుగారు సరసులగుచున్నారు. డిటెక్టివ్ తెలివితేటలన్నియును, కామినీమణుల గని పెట్టుటలో గాబోలు—మీరామెను పోల్చినారా?"

"ఆమె రేవతియనియే నా తాత్పర్యము,"

"మీరు రేవతినిజూచి యెంతకాలమైనది?"

"చాలకాలమైనది."

"అటులనైన మీరెటులపోల్చగలరు?"

"నేనుచూచి యెంతకాలమైనను, నామనసున నిల్లుకట్టుకొని కాపురముచేయుచున్నది నేనామెను చక్కగా గుర్తింపగలను?

"ఐతే మీరు యిపుడు అనుచున్నమాటయేమి"

"నేను యిపుడనవలసినమాట యేమియు లేదుగాని ఏకాంతా[illegible]కోరిక; మనము విస్తారము కష్టపడి వెదకుచుం[illegible]మో అట్టియామె నేడు కానవచ్చినదిగదా యని [illegible]సించుచున్నాను.

"మీరు యీయామెను పూర్వము నుండియు యెరుంగుదురు గాబోలు?"

"ఎరుగకేమి, మేమిరువురము నొకరినొకరెరిగియుండుటయేగాదు. చాలకాలమునుండి యన్యోన్యము అంతరంగికముగ ప్రేమించుకొనుచున్నాము." ఈనాటికి మానోములు పండినయటుల పరస్పరావలోకనము కల్గినది."

"సరే. ఇంక కర్తవ్యమాలోచింపవలెను. ప్రస్తుతము వేళయతిక్రమించుచున్నందున భోజనముచేసుకొని, ఉపాహుయు

ముగాఁ బ్రసంగించెదముగాక." అనుచు వీరిరువురు
ను స్నానమునకుఁబోయిరి—"

భోజన సమయమున నరిందమ్‌బాబును జూచి, మిత్రాబాబు! "రేవతిని తా మెప్పుడుకనిపెట్టి యెప్పుడేరీతిని సుక్షితగాచేసినారు ?"

"నే నేనాఁడు, చచ్చుటకు సిద్ధముగానున్న ముసలివాని వేషముతో గోసాయిగారియింటికి పోతినో, ఆనాఁడే, రేవతిని కనిపెట్టితిని. కావుననే యొకకనిష్టేబును, ఆమెయమ్మ వేషమును ధరియింపించి, యామెను మాయింటికి తెప్పించుకొని జాగ్రత్తగా మీకొఱకే యింతకాలమును కాపాడుచుంటిని. కావుననే మీరామెను పాణిగ్రహణము చేసుకొనవచ్చును. కాని తనచెల్లెలు రోహిణిని యెవరో హత్యచేసిరనియు, నావిషయపుపరిశోధనలో నేను పనిచేయుచున్నాననియు, తెలిసి, నన్నడిగి తెలిసికొనఁబ్రయత్నించినను, నేనవకాశ మీయలేదు" అని యనుచుండునంతలో రేవతి మజ్జిగవడ్డించుటకువచ్చి యెదుటనేగూర్చుండియున్న దేవేంద్రబాబును జూచి, నిమీలితనేత్రయై, లజ్జావనతవదనయై, కంపితదేహవల్లియై, యల్లనల్లన నరిందమ్‌బాబునకువడ్డించి, యనంతరము దేవేంద్రునకడకుఁబోన జంకుచుండెను.

ఇదియంతయుఁ గనిపెట్టుచునేయుండిన దేవేంద్రునిమనసును మయస్కాంతసన్నిధి నాకర్షింపఁబడువిధమున నెటుల పరిభ్రమించుచుండునో దురూహ్యము.

అరిందమ్ క్రేగంటఁగనిపెట్టి, "అమ్మా! రేవతీ! నీవు జంకవలసినపనిలేదు నీకోరినప్రియుఁడగు దేవేంద్రవిజయుఁడే ఇతఁడు.

ఇట్టిసుసమయము తటస్థించుగాక యనియే యింతకాలముచు వేచియుంటిని. ఇంతకాలమును నిన్ను మాయింటనుంచుకొంటి ని. ఇక నీజన్మము ఫలించినది నీకోరనకోర్కె లీడేరినవి. నీకష్ట ములు గట్టెక్కినవి. నీవింక నీతనిచేపట్టి సనాథవుకమ్ము" అనె ను. అంత నామెయు నెట్టనవడ్డించి లోపలికిఁబోయెను. భోజ నానంతరమున దేవేంద్రమిత్రాబాబును, అరిందమ్‌బాబును గూ ర్చుండి రేవతిని రావించి యామెతో కొంతవడి ప్రసంగించి య నంతరము రోహిణీచరిత్రఁదెలుప నామెయు నెంతయోవిచారించి బిశ్వాత్ కేశవబాబుపేరుతోఁ దనకుఁజేసినభంగపాటులు జ్ఞప్తికి రా భీతిలి, ఫూల్‌సాహేబుపేరుతో నాతఁడుచేసిన దౌర్జన్య ములకు నక్కజమంది, గోపాలచంద్ తనయెడలను, దనచెల్లి యలగు రోహిణియెడలను, ద్రవ్యకాంక్షచేఁజేసిన ద్రోహమునకు దగినదండన నొందినందు కానందమొంది, తాఁగోరిన దేవేంద్రవి జయుని మరలఁ జూడఁగలిగినందుకు సంతోషమొంది, యాయ నను బెండ్లియొనర్చుకొనుసమయ మాసన్నమైనందుకుఁ బరమా నందమొందెను.

అంతట నరిందమ్ మంచిముహూర్తము నిశ్చయించి యామఱుదినమే వారికి వివాహముగావించెను. వివాహమైనపి దప, నరిందమ్‌గారియింట జరుపఁబడిన, సభలో, రేవతీదేవేం ద్రు లరిందమ్‌బాబుగారిని స్తుతింప, నరిందమ్ సభ్యులఁజూ

చి, రేవతీదేవేంద్రవిజయాదులం గూర్చియు, గుల్‌సుమ్‌సిరాజహీనులఁ గూర్చి జరిగినచరిత్రంగూర్చియు నిట్లనియె.

«మిత్రులారా! ఈ విస్తృతవిషయమున నేనుచేసిన దేమియు లేదు. ఏలనన—

శ్రీలం గోరినభంగి నిచ్చి జనులన్ జిత్రంబుగాఁ గాచి, దు
ష్కీలుం ద్రోహిని వానికార్యముననే శిక్షాయుతుం జేయుచున్
దాలో లుండయి బ్రోచుచు న్స్వజనబృందమ్మున్ యశఃకాములన్
లీలం దేల్చుమహేశుఁ డిచ్చుశుభము ల్నిత్యంబు నీవ్వాటికిన్.

అనుచరుల లోకములో నెట్టివా రేదికోరిన నయ్యది వారలకొసంగి యద్దానిని వారు చక్కఁగ నుపయోగించుచున్నారా, లేదా యని పరీక్షించుచు, నద్దానిలో నేమాత్రముచెడ్డ కనుపించినను, ఆచెడ్డవలననే వారిచేతలలోనే వారిని పెక్కుకష్టముంచి, వారిని మంచిత్రోవలోనికి తెచ్చుభారము దైవముదే. కావున నొకద్రోహి లోకమున శిక్షితుండైనను, ఒకసన్మార్గవర్తి కీర్తిమంతుండైనను అంతకును, వారివారిప్రవర్తనలే పూచీదారులై యున్నవి. కావున నేను యెట్టిపొగడ్తలకును తగను.

కాని యేదియెట్లులనున్నను మిక్కిలి సంతోషకరమైన కార్యములు గుల్‌సుమ్‌సిరాజ్‌హీనులయొక్కయు, రేవతీదేవేంద్ర

విజయమిత్రాబాబులయొక్కయు వివాహములు నాకు లోకకంటకుండును, పరమనీచుడును, భయంకరద్రోహియునగు ఫూల్‌సాహేబుమరణముకన్న నెక్కుడగువానందము నందించినవి. ఇంతకు విధి యిట్టి సహాయము చేసెగదా, నా గుర్తుసమ్ములు యెన్నిచిక్కులు పడినను, తుదకు నాగోరిన పురుషుల చేటుబట్టుగలిగిరి. దైవమనుగ్రహించినచో, మానవులకు అలభ్యములును, అసంభవములును అనితోంచిన కార్యములైనను జయప్రదములు కాగలవు.

నేనిదివర కెన్నెన్ని కేసులలోనో పనిచేసియున్నాను. కాని యీ కేసులో నేను పొందినన్ని యిబ్బందులు నేనెందును పొందలేదు. చేయునది యొకటి, వెదకునది యొకటి, దొరకినదియింకొకటియునై ప్రతిపదమునను, ప్రతిక్షణమునను అపాయభయమేకదా! ఇంతకును దైవప్రేరణయు, ప్రకృతియును ఈవిషయమున మిక్కిలి సహాయభూతములైనవేకాని కానున్న నొకయర్భకుడు, ఒకమానవమాత్రుడును నగు అరవిందు బ్రహ్మాండమైన ఈకేసులో, జయమందుట మిక్కిలియాశ్చర్యముకాదా!

ఏదో, ఎట్టులనో ఫూల్‌సాహేబు మరణించినాడు మోహినికూడ పాపము మరణించినది. గౌరి ఖైదులోనున్నాడు. గోపాల్‌చంద్రయు, గోసాయియు కఠినశిక్ష నొందినారు. తక్కినద్రోహులందరును, తగినదండన నొందినారు. కాని జమీందారిణిమాత్రము మరికానరాలేదు. దాని యంతమును గూడ వినగోరుచున్నాను."

దేవేం—ఆపని పూర్తిగా నెరవేర్చి తమకు ఖ్యాతితెచ్చుభారము నాయందున్నది. నాకు జుబిలీయా కావించినయుపకృతులు నేను మరువజాలను. కావున నామెరుపట్టుటకు నాకు తాము సెలవొసంగ ప్రార్థించుచున్నాను.

అకీం—అభ్యంతరమేమి? తప్పక మీకు ఆప్రయత్నములోనుం డుము—గుల్సుమ్సిరాజ్హీను లింక నిష్కంటకముగా తమ జమీన్దారీ నేలుకొనవచ్చును—రేవతీదేవేంద్రవిజయు లింక సుఖముగా కాలముబుచ్చవచ్చును.

అనుచునాశీర్వాదపురస్సరముగ
సభ ముగింపఁబడెను.



---

N. B. ఈగ్రంథము 104 వ పుటవఱకు బరంపురమున స్వేచ్ఛావతీముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

శ్రీ

# "వేగుంజుక్క" గ్రంథమాల.

ప్రథమమరీచి.

## ఉషఃకాలము.



క॥ 'కలభాషిణి' యనుపేరున
నలయాంధ్రకవిత్వకాంత యాత్మచరిత్రం
బలఘుప్రక్రియఁదనకొమ
రులకుం దెలియంగఁజేసెఁ బ్రోత్సాహశీలన్॥

మ॥ నవలారూపముగా, మనోహరముగా, నానారసోల్లాసిగా
నవలావణ్యయుతంబుగా నెసఁగ, నాంధ్రప్రబంధము, సంస్తూయమా
నవచఃప్రౌఢిమఁజేయఁగాఁబడిన, గ్రంథంబిద్దియే యంచు మా
ననాథుల్ కవినాథులున్ దెలిపి రానందంబుసూచించుచున్॥

ఇది యాంధ్రభాషకు నూతనాలంకారముగు నొకవచనకావ్యము. ఆంధ్రకవితాసతి తన చరిత్రయంతయుఁ గలభాషిణి యనుపేరఁ దన కుమారులగు నాంధ్రులకుఁ దెలియఁజేయుట. మృదుమధుర నిర్దుష్టరీతితో వర్ణింపఁబడినది. ఇందలి మాటల ముద్దుతనమును, వర్ణనావిశేషముల ప్రౌఢిమయు, సందర్భోచిత

రసపోషణంబును గనిన నెంతమందునకైన నానందముగనుండును. మఱియు నిందు, కలభాషిణి నన్నయార్యునిచేఁ జిక్కుటయు, రాజరాజు నంతఃపురమునఁ బెరుఁగుచు, నారాయణభట్టనన్నయభట్టారకులయొద్ద విద్య నేర్చుకొనుటయు భారతి ( సంస్కృతభాషాకాంత ) తోఁ గలభాషిణికిఁ గలస్నేహంబును, రంగనాథరామాయణ, భాస్కరరామాయణంబులు, కలభాషిణి కొసంగఁబడుటయు, అథర్వణుఁడు కలభాషిణికి శబ్దశాస్త్రంబు నెరింగించుటయు, గణపతిదేవ, తిక్కనార్యసంభాషణంబును, తిక్కనసోమయాజిచే భారతము రచియింపఁబడుటయు ప్రతాపరుద్రమహారాజుని విద్యావైశద్యమును, శ్రీనాథుని దేశయాత్రాభిలాషయు, పోతనార్యుని కవితామహత్త్వమును, విజయనగర సామ్రాజ్యము విజృంభించుటయు, శ్రీకృష్ణరాయలు కలభాషిణి పాణిగ్రహణమొనర్చుటయు రాయలదిగ్విజయ యాత్రాగమనమును, విజయనగరసామ్రాజ్య మంతమొందుటయు నతివిచిత్రముగ, మనోహరముగ, వర్ణింపఁబడినవి. ప్రౌఢకవుల శయ్యావిశేషములన్నియుఁ జర్చింపఁబడినవి. వేయేల? ఇందుఁ ద్రొక్కఁబడిన త్రోవలన్నియు, నూతనములు, ప్రౌఢములు. వ్రాయఁబడినది చరిత్రమే యయ్యును, నవలవలె జగుఁజగుఁ రసమొలుకుచుండును. చక్కని యచ్చుతో, "ఫెన్ఫ్ నైయుపేపరు" పై ముద్దుగ నచ్చొత్తింపఁబడినది.

చందాదారులకు రు 1-0-0. ఇతరులకు రు 1-8-0 లు పోస్టేజీకాక.

గ్రంథకర్త హూణాంధ్రభాషాపారంగతులగు

మ॥ రా॥ రా॥ తాపీ ధర్మారావుగారు, బి. ఏ.

D V. KRISTNA ROW,

Secretary, Vegujukka Series,

Berhampore, Ganjam Dt.

**అయ్యా !** శ్రీరస్తు.

తమ యుషఃకాలమును ప్రథమమరీచింజూచితి. ఆంధ్రభాషయనెడు కలవాణి యిఁకఁ దమవలనఁ గలవాణియే కాఁగలదని తలఁచెద. ఐనఁ దమ పూనికింజూడ, నంగలకలవాణియా నేమో యని శంకించెద. అటు గానీకుఁడని వేఁడుచున్నాఁడ. నే యేల? ఇప్పటి తమ యుషఃకాలము ప్రథమమరీచియగుటనో యట్టిబంగరునగవలెం గన్పట్టుచున్నది. ఆయాగ్రంథములలోని పద్యముల గద్యములం గొన్నింటి నే నుపహరించిన రత్నాభరణమని చెప్పనొప్పియుండును. ఇఁకనైన నప్పగిదెనగుటఁ దగియుండునని తలఁచుచున్నాను. ఇప్పటికీ యుషఃకాలము కాలోచితముగా నుండుటం జేసి వాసిఁగనుచున్నదనియె యెన్నుచున్నాను. తమ యుద్దేశములెల్లఁ దద్దయు మంచివగుటచేత భగవదనుగ్రహంబున సార్థకములగునని భావించుచున్నాను. భాషాపోషణరూపమున లోకోపకారముం గావింపఁ దలంపుఁగొని కృతకృత్యులగుచుండు తమకు సర్వత్ర జయము గలుగవలయునని భగవంతుం బ్రార్థించుచున్నాను. చిత్తగింపుఁడు.

రాజమహేంద్రవరం,
ది ౫-౮-౧౨.

ఇట్లు విన్నవించు తమవిధేయుఁడు,
కొక్కొండ వెంకటరత్నశర్మ.

## గ్రంథవిమర్శన.

ఉషఃకాలము—పేరునుబట్టియే ప్రారంభమని చదువరులూహించి యుందురు. దేనికి ప్రారంభమో అదిమాత్రమూహించి తెలిసికొనదగినది కాదు. ఇపుడు, విజ్ఞానచంద్రిక, ఆంధ్రభాషాభివర్ధని మొదలగు సంఘములు బైలుదేరి నూతనగ్రంథప్రాచుర్యము చేయుచున్నటులనే, గంజాంజిల్లా బరంపురమునందు "వేగుఁజుక్క" గ్రంథమాల యను నామమున నొక సంఘమును స్థాపించినటుల లోగడ నొకమారు మాపత్రికయందుఁ బ్రచురింపబడిన విపులమగు ప్రకటనను బట్టి తెలిసికొని యుందురు.

ఈసంఘమునకు, న్యాయపతి రామానుజస్వామి, బి. ఎ., బి. ఎల్. గారధ్యక్షులు. డి. వి. కృష్ణారావుగారు కార్యదర్శులు. తాపీ ధర్మారావు బి. ఎ. గారు సంపాదకులు. వీరి ప్రథమగ్రంథమే విమర్శనావిషయమగు "ఉషఃకాలము"

ఇందు కలభాషిణీస్వీయచరిత్రమను పేర ఆంధ్రభాషయొక్క యుత్పత్తిస్థితులు బాగుగ నేయేకాలమున నెట్టిమార్పులు కలిగినదియు నెట్లభివృద్ధి పొందినదియు నేయేప్రభువుల యాదరములనందినదియు నేయేకవు లేయేగ్రంథముల రచించినదియు భాషాంతరీకరించినదియుఁ గొంతవఱకుఁ గవిత్వస్వారస్య విమర్శనయు మున్నగువానితోఁ బ్రస్తుతకాలమువఱకు వ్రాయబడియున్నది. ఈ గ్రంథమును జదువుటకే యెంతయో యోర్పు గావలసియుండ గ్రంథకర్త లెంత శ్రమదీసికొనిరో వ్రాయనలవిగాదు. బహుగ్రంథావలోకనమువలన గాని యీ గ్రంథమును పూసగ్రుచ్చినటుల ప్రారంభమునుండి యింతవఱకు వ్రాయనలవి గాదని మాతలంపు. వెల రూపాయియున్నర. పోస్టేజీ వేఱుగ ధరించవలయును. ఆంధ్రభాషాభిమానులెల్లరు తప్పక చదువఁదగినది. పుస్తకమును సాంతముగ జదువుటలో నాలస్యమగుటచే గ్రంథము మాకార్యస్థానము చేరిన నాలాకాలమునకు విమర్శవ్రాయుట తటస్థించినది.

దేశాభిమాని.

అయ్యా!

మీరు ముద్రింపించిన యుషఃకాలమను పత్త్రముం జదివితి. ఇంగ్లీషు నుండి భాషాంతరీకరణము కాఁబట్టి యంతహృద్యముగాలేదు. మీకీయభిప్రాయమేమి యుపయోగము? అయినను, "మీ వేగుఁజుక్కకీ యుషఃకాలము సముద్యోతనంబౌచున్నది. ప్రభానవనవోన్మేషమింకఁ గాఁగలదు." అని మాత్రము వ్రాయుచున్నాఁడ.

కాకినాడ,
ది 9 - 9 - 1912.

ఇట్లు
శృంగారకవి సర్వారాయుఁడు.



J. RAMAYYA PANTULU,
B. A. B. L.
Presidency Magistrate.

Ananda Bang.
Vepary
Madras, 1-10-12.

అయ్యా !

తామాదరపూర్వకముగా నంపిన "ఉషఃకాలము" అను గ్రంథము కొంతవరకుఁ జదివినాఁడను. మిక్కిలి చక్కఁగానున్నది. భాష మొత్తముమీఁద సలక్షణము. శైలి మనోహరము. కల్పనావిశేషమపూర్వము. అచ్చటచ్చటఁ గొన్నియంశములు భాషాచరిత్రమున కించుక భిన్నముగానున్నవని నాయభిప్రాయము. రెండవకూర్పులో సవరణచేయవచ్చును. గ్రంథముఖముననున్న చంపకమాలిక మిక్కిలి ప్రశంసనీయము. "వన్నెలకనకంబు మా తెలుఁగు నీరసవానటుచేయకుండ" యను పాదమును జదివినపుడు భాషాసేవకుల కెవ్వరికయిననుఁ గంటఁదడిపట్టకయుండదని యెంచెద. ఇట్టి గ్రంథము లింక ననేకములు రచించి ధర్మారావుగారు భాషను మేలొనరింపఁగలరు. గ్రాంథికభాషను నాశనముచేయవలెనని కొందఱు కంకణము కట్టుకొన్నారు. వారి దురుద్యమము సాగకుండఁ జేయుభారము భాషాసేవకులమీఁదనున్నది. మీసమాజమిందునకుఁ బూనుకొనుట కడుఁ బ్రశంసనీయము.

ఇట్లు భవద్విధేయుఁడు,
జయంతి రామయ్య పంతులు.
కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు,
ఆంధ్రసాహిత్యపరిషత్తు. చెన్నపురి.

మ॥ రా॥ రా॥ తాపీ ధర్మారావునాయఁడుగారికి బి. ఏ.
బరంపురము.

ప్రియమిత్రమా !

శ్రీ "వేగుచుక్క" గ్రంథరత్నమాలయందు తమచేఁ గూర్పఁబడిన **వింత**

పతకమగు “ఉషఃకాలము”ను పొత్తమునుజదివి, మిగులయానందమందితిని. నన్నయకుఁ బూర్వమునగల యాంధ్రభాషయొక్క స్థితి యింకను దురవగాహ్యముగా నుండుటచేఁ గాఁబోలు, దానినివిడిచి ఆయనకాలమునుండి నేటివరకాభాష పొందిన వివిధమార్పులను పూసగ్రుచ్చినట్లు ఇంపుగా దెలిపియున్నారు. శైలి మనోహరముగానున్నది. మధ్యమధ్య సందర్భానుసారముగా, “ఎంతకాంతిదమైన వస్తువునుదీసికొనిన దానికిసైతము నల్లనినీడయొంటి యుండునుగదా. సుఖమునకు దుఃఖమును, దుఃఖమునకు సుఖమును వెన్నంటియేయుండును. అసూయాపరులగు మానవులచే నిందింపబడని మహామహులెవరైన నుందురా” యను మొదలుగాగల ప్రాపంచకన్యాయముల నెన్నియో విశదీకరించియున్నారు. అయినను, ఇప్పటిస్థితిగతులను మననునబెట్టుకొని 121 పుటయందు “యిప్పటివారలు పాఠశాలలో జనివిన యనంతరము దేశాటనమునకని యెంతయోధనమును వెచ్చబెట్టుచున్నారలు” అను వాక్యమును మునుపటికాలపు శ్రీనాథుని నోటనుంచుట పొరబాటని తోచెడిని. మఱియు 158 పుటయందలి “యాదేశంబెల్లఁ దనయాధీనంబుఁ జేసికొని యట కృష్ణరాయధ్వజము నెత్తించితిమి” యను వాక్యభాగమొకింత సవరణగావలసినట్టు గనుపడును. పరికించిచూడగా పూర్వము దయగలరాజుల పోషకత్వమునను, మతాభిమానమునను, పెక్కు యుద్గ్రంథములు రచియింపబడి భాష కడువృద్ధినొందుచుండినట్లును, తరువాత క్రమముగా పోషకత్వలోపముననేగాక, కేవల శృంగారగ్రంథరచన ప్రారంభించిననాటనుండియు, శృంగారచేష్టల గాలముబుచ్చిన రసికులదశనుబోలి త్వరత్వరగ క్షీణింపసాగినట్లును గానిపించును. సత్యశరీరధారిణియగు జీవముభంగి, సద్గ్రంథోపాధిచేతనే భాషయు ఔన్నత్యమునందుగదా. ప్రస్తుతకాలమున మరల పీఠికాపురము, పోలవరము, మునగాల, మున్నగు యూరుల ప్రభువుల మన్ననలనందుచు, దేశమున నాఁకరించియున్న నీతి, మత, సంఘ, పరిశ్రామికాది సంస్కరణోద్యమములచే నుదయించుచున్న భక్త్యావేశమున నూతనముగ సద్గ్రంథములు వెలువడి భాషాభివృద్ధినిమాత్రమేగాక, దేశాభివృద్ధిని సైతము

నొడగూర్పునని నమ్మకము కలుగుచున్నది. సమస్తసంస్కరణములతోఁబాటు భాషాసంస్కరణమును, కొందరు బూనినారు. వారినిగురించి దురభిప్రాయము లను కలిగియుండక, వారిసదుద్దేశములను గ్రహించి, వారికి మీగ్రంథమాల సాయపడునుగాక. మీ రాబోవు ద్వితీయమరీచి ఎట్లుండునోగాని ఈ "ఉషఃకాలమొ"క నవలగా గానబడినను, తక్కిన నవలల వలె కేవల కాలక్షేపమునకై జదువ వలనుపడదు. భాషాభిమానము మెండుగానుండవల యును. వీలైనచో రెండవకూర్పున "కవి, కాలము, గ్రంథములు, పోషకులు, స్థానము" అను శీర్షికలక్రింద నొకవివరణపట్టీని మీగ్రంథమున కనుబంధముగ బ్రచురించినచో నెంతయో ప్రయోజనకారికాగలదని నానమ్మిక.

ఇట్లు భవన్మిత్రుఁడు,

బరంపురం,<br>
ది 2 - 11 - 1912.

వెలిదండ శ్రీనివాసరావు.<br>
ప్రార్థనాసమాజము కార్యదర్శి.

ప్రియధర్మరాయా !

నాయెడ గౌరవముంచి నిండుదయతో మీరంపిన "వేగుఁజుక్క" గ్రంథమాలా ప్రథమమరీచి – ఉషఃకాలమను గ్రంథము నాకందినది యమందానందంబు నొందితి. ఆంధ్రభాషాభివృద్ధి క్షయపునరుద్ధారణ విషయములందెలుపు గ్రంథములలో మీపాత్రము ఉత్తమమైనదని యెలుగెత్తిచాటఁగలను. ఆంధ్రవాఙ్మయోదంతమంతయు పాఠకులకును శ్రోతలకును అవంతయయిన వేసరింతగాని విసుకుగాని పుట్టనీయక వింతవింతలగు కథలతో మేల్బంతియగు నొకయింతి చెప్పనటుల నొనర్చిన మీస్వతకల్పనలకు నే నెంతయు సంతసించితి.

గ్రంథములో మీరు తొక్కినత్రోవ యపూర్వమయినదని నిస్సందేహముగఁ జెప్పఁగలను. ప్రారంభము మొదలు చివరవరకును ప్రస్తుత భాషాసంస్కరణకర్తల కేహ్యముగఁ గన్పడుసంధు లతిపట్టుదలతోఁ బాటింపబడియు

న్నవి. శైలి అత్యంతమధురము. రచనాచమత్కారము చెప్పనలవిగాదు. ఒక ప్రకరణము చదివి యంతటితో నిప్పుడు ముగింతమనుటకు బుద్ధిపుట్టదు. గ్రంథమంతయు సారెసారెకుఁ జదువ నుత్సాహముపుట్టుచుండును.

మీకలభాషిణి సకలమనోభిలాషిణి. ఆమెకును భారతికిని జరిగిన సంభాషణములు నీతివిజ్ఞానప్రదాయకములు. తిక్కనార్య పోతనమంత్రుల వర్ణనలు కీర్తనీయములు. మీచంపకమాలికలోని పలుకులు ముద్దుపలుకులు సమయోచితంబుగఁ గథామధ్యంబున నాయకవివరులం దెచ్చిపెట్టి కలభాషిణి వారిని దర్శించినటులఁజేయుట, వారివారిసామర్థ్యముల నుత్ప్రేక్ష లేకుండ సాధ్యమైనంతవఱకు వర్ణించుట తననాదరించు మహాత్ముల భావమయినపుడు కలభాషిణి చెందు వికలభావంబును అట్టిమహనీయులసందర్శనంబున, నొందినయానందంబును, వివిధస్థలంబుల వేర్వేరువిధంబుల విహరించుట కలభాషిణి తనమాతృస్వభావంబుచే నచ్చటచ్చట పలికినవాక్యములను భారతి యిచ్చు ప్రత్యుత్తరములు వ్రాయుటలో నేతద్విషయమయి లోకానుభవసిద్ధమగు మీస్వాభిప్రాయంబులు తెలుపుట, ఇవియన్నియు మీకే తగును. వేయేల, గ్రంథమంతయు రసభూయిష్టంబయి మిగుల శ్రేష్ఠంబయి సర్వకళాశాలాపరీక్షలకై చదువువారికి పఠనీయంబయి విలసిల్లుచున్నదని వక్కాణించుటకన్న వేరేమియున్నది.

కలభాషిణిని మీనూతనగ్రంథమాలాధారణచే రమ్యభూషిణిగఁ గావింపసమకట్టిన మీసదుద్యమంబు సదా సుసాధ్యంబగునటులఁజేసి మీకు చిరాయువొసంగి రక్షించవలెనని జగదీశ్వరుని ప్రార్థించుచున్నాడ.

Berhampore,
3—11—12.

VUTAKURI VENKATAGOPALARAO,
Retired Tahasildar
and
Ex. President of
Andhrabhashabhi Verdhani Samajam.

అయ్యా !

ఉషఃకాలము విషయమై నాయభిప్రాయమును గోరుచున్నారు. నేనొక గొప్పపండితుఁడను గాను. నాకు దెలిసినంతవరకు రసవంతముగా నున్నది. ఇంతకంటె రసవంతముగాఁ జేయుటకు మిక్కిలి యవకాశమున్నది. నగలు, పుత్తళ్లు, తెనబాయిలు, ఒడ్డాణలు, కమ్మలాలు, తగరాజాలు, మొదలగు పదము లెన్నియో యుండ, బుడుతలూర అను పదము, పందలకొలఁది పర్యాయము లుపయోగింపఁబడినవి. ఆయాకవులకవిత్వములలోని యుచ్ఛభాగములను అంతగాఁ బ్రకటించినట్టు కనఁబడదు. నానారసములను బ్రకటించి హృదయరంజకమొనర్చు నీతిని ధర్మమును మనుల నెలకొల్పుటయే పరమోత్కృష్టమైన యాశయము గాఁగల కవులనేకులు మనయాంధ్రమండలమున జనియించినారు. ఒక్కొక్కరి చరిత్రయే యొకనవలుగా వ్రాయఁదగియున్నది. మునుముందు మీరు వ్రాయఁబోవు పుస్తకములకు నా యీమాటలు సహాయకారియగును గాక. నా మనస్సు కార్యాంతరమున మగ్నమైయుండుటవలన నింతకంటె వ్రాయసమర్థుఁడను గాను. క్షమింపఁ గోరుచున్నాను.

విధేయుఁడు,

పిఠాపురం,
ది 7-10-1912.

ఆ॥ సోమనాధరావు.
విజయేంద్రవిజయాదిగ్రంథకర్త.

To

M.R.Ry. T. DHARMARAO NAIDUGARU, B. A.
Berhampoor.

మిత్రరత్నమా !

తే. గీ. తొలుత వేగుఁజుక్క వొడమి నలుగడలను
దీప్తిఁ గాంచ నుషఃకాల తేజమునను
మెల్లగాఁ గలభాషిణి మేల్కొని తన
**స్వీయచరితంబు బ్రకటించె వేడుకలర.**

తే. గీ. మాత యెట్టిదో యట్టిదే మాతృదేశ
మట్టిదియసుమ మాతృవాగని తదీయ
స్వీయచరితంబు వ్రాసిన ధీయుతుండ
ధర్మరాయుండ! నీకీర్తి నిర్మలినము. 2

తే. గీ. తనపుఁగని పెంచి పోషించు తల్లియెంతో
యంతయేగద తల్లిబాసని చరితము
వ్రాసినాఁడవు పుణ్యంబుఁ జేసినావు
తల్లిఋణమును దీర్చుట ధర్మముగుట. 3

తే. గీ. ఆంధ్రభాషాచరిత్ర, మహార్ణవంబు
తానకకృతి తేపయాకర్ణధారుఁడవగు
దీవు కవికృతిరత్నము లిందు నెన్ని
యేని స్వాభిమానంబునఁ గానదగును. 4

భవదీయమిత్రుఁడు,

శం. జగన్నాయకుఁడు.

ఎస్. ఎస్. స్కూలు తెలుఁగుపండితుఁడు.

ఇచ్ఛాపురము.

బరంపురము,
15-11-12.

## విరోధికృన్నామ సం॥ శ్రావణమాసము.

## గ్రంథస్వీకారము.

### ఉషఃకాలము.

ఇది తాపీ ధర్మారావుగారిచే రచియింపఁబడి బరంపురమునందలి “వేగుఁజుక్క” గ్రంథమాల యందు మొదటిపాత్రముగఁ బ్రకటింపఁబడినది. ఇందలివిషయ మాంధ్రభాష కలభాషిణియను నామముతోఁ దినచరిత్రమును దెలి

యుంచేసికొనుట. శైలి బాగుగానున్నది. కలభాషిణి సద్గ్రంథకవులలోఁ జేర్చ-నదగినవారిఁ గొందఱను జేర్చకుండుటకుఁ గారణమేమో తెలియదు. ముందుకూర్పులో నీలోపమును సవరించుకొనుగాక!

శ్రీ వెంకటరామకృష్ణకవులు.
శతావధానులు, దర్బారుకవులు.
పిఠాపురము,

## ఆంధ్రపత్రిక.

## కృతివిమర్శనము.

మ॥ రా॥ రా॥ తాపీ ధర్మారావునాయుఁడు బి. ఏ. గారిచే రచియింపఁబడి కలభాషిణి యను నొక కాంతామణి స్వీయచరిత్రగ "వేగుఁజుక్క" గ్రంథమండలివారిచేఁ బ్రకటింపఁబడి విమర్శనార్థము మా కార్యస్థానమున కనుపఁబడిన యీపుస్తకమును సకలాంశంబులం గని యానందించితిమి. శాస్త్రీయకవిషయముల నిట్టి మనోహరసల్లాపరూపముగ రచించి, చదువువారి మనంబులను సంతోషాంబుధి నోలలాడింపఁజాలిన వాగ్వైచిత్రి కలవారు మన ధర్మారావుగారు తప్ప వేరొక్కరు నేటికి మన యాంధ్రప్రపంచంబున మాకుఁ గన్పట్టకున్నారు. ఇట్టి గ్రంథరచనచే సాంఘికవిషయతతికి నొక నూతనాలంకారమును సమర్పణము చేయుటయే కాక, యాంధ్రదేశంబున కమూల్యమగు నాయకమణి నొకదానిని సమర్పించిరని నొక్కి వక్కాణింపనగును. గ్రంథమునందలి మాధుర్యరసమున్ గ్రోలి క్రోలి మా మనంబులు తనివితీరకుంటచే రావుగారి నామంబును బంగరుటక్కరంబులతో వ్రాయఁదగునని యెంతయుం గోరుచుండును.

క॥ "చెప్పఁదగుఁ గవితరసముల్ చిప్పిలనప్పప్ప బళి బళీ యన లేదా
యెప్పుడు చెప్పకయుండుట యొప్పు సుమీ........."

అను నంశమును మనంబునందుంచుకొనియే యీగ్రంథము నింతమనోహరముగా రచించియున్నారని మే మెన్నుచున్నారము. రచనయందింత మాధుర్య

మొలికించుచున్నను, రావుగారేలకో యభిప్రాయభేదములకు మార్గంబులం గొన్నింటి నవలంబించియున్నారు. వానిలోఁ గొన్నింటి నీక్రిందఁ బొందు పఱచి, వారియాశయమెట్లో వినఁగోరుచున్నాము. ... ...

బొంబాయి,
18 సెప్టెంబరు 12.

ఇట్లు
మండపాక పార్వతీశ్వరశాస్త్రి,
పంచమజార్జి గ్రంథమండలి (సంపాదకుఁడు.)

ఆర్యా!

బ్రహ్మపురమున స్థాపింపఁబడిన "వేగుఁజుక్క" కార్యస్థానమునఁ బ్రథమము రీతిగఁ బ్రకటింపఁబడిన "ఉషఃకాలము" నామూలాగ్రముగఁ జూచితిని. ఇయ్యది సమయానుసారంబుగను పాత్రోచితముగను జేయఁబడిన ప్రకృతి వర్ణనలకుఁ బుట్టినిల్లై సంస్కృతాంధ్రభాషాధురంధరులచేత నేకాక హూణభాషా విశారదులగు నాంగ్లేయులచేఁగూడ మెప్పుపొందఁదగిన మృదుమధురశైలికలదని చెప్పఁదగిన చక్కనినవలగ్రంథము. ఇందు పాత్రప్రవేశగోపనము లతిమనోహరముగఁ జాలవఱకు పాటింపఁబడినవి. గ్రామ్యపదప్రయోగంబులు గాన్పింపవు. అన్వయక్రమణిక కేవల పామరజనులకు సుబోధకము కాకపోయినను విద్వన్మణుల కత్యంతప్రీతినొసంగక మానదు. సందర్భానుసారంబుగ నుగ్గడింపఁబడిన ప్రసిద్ధకవిరాజుల చారిత్రంబు లతిమనోహరములు సమంజసములునై యున్నవి. వానింగన్న పూర్వకవులలోఁ గొందఱిచారిత్రంబు లటుంచనిచ్చి తుదకు వారినామములైన నిందు వెల్లడింపమి లోపమును గ్రంథకర్తగారింకొక కూర్పున సవరించుకొందురుగాక. ఇట్లు, విద్వద్విధేయులు,

కాకినాడ,
20-11-12.

కోగంటి లక్ష్మీనృసింహాచార్యులు.
శ్రీ సముద్రాల వేంకట అప్పలాచార్యులు.

# శ్రీ సరస్వతి.

సంపుటము ౧౪ ] ఉషఃకాలము. [ సంచిక 8, 9.

ఈపేరఁబరఁగు నొకనవల బరంపురమున నెలకొలుపఁబడిన "వేగుఁజుక్క" గ్రంథమాలయొక్క ప్రథమమరీచి, మాకార్యస్థానమునకుఁ జేరినది. దీనిసంపాదకుఁడగు తాపీ ధర్మారావునాయుఁడు బి. ఏ. గారు గద్యపద్యములుగూడఁ జక్కఁగ వ్రాయనేర్చిరని వారిచే రచింపఁబడి పీఠికి కంఠమాలగా సమర్పింపఁబడిన చంపకమాలయె చెప్పుచున్నది. క్రొత్తగా బయలుదేరిన నవలానవలకములలో నిదియు పెన్నికకెక్కఁదగిన గ్రంథమె. కథాకల్పనసరసము. శైలి సులభము. వర్ణనలు మనోహరములు. ఇందలి కథ యాంధ్రభాషాస్వీయచరిత్ర. ఇందుఁ బ్రస్తావవశమునఁ బ్రస్తుతకాలపుఁ గవీశ్వరుల కొందఱినామములు వారివారి నైపుణ్యములును సూచింపఁబడుటయు సమంజసమె. మూల్యము రు 1-8-0 కావలసినవారికి. "వేగుఁజుక్క" గ్రంథమాలకు బరంపురం వ్రాసిన గ్రంథము దొరకును.

---

# Ushahkalamu.

---

This is a novel publication in Telugu written by Mr. Tapi Dharmarow Naidu B. A. It is fiction, art and history all rolled into one and served to the Telugu public. It is a brief history of the Telugu language and literature written in the form of an autobiography, the teller being Telugu literature herself, personified and introduced to the reader as 'Kalabashini'—the sweet speaker. Indeed 'Ushahkalamu' distant as it is, here and there, from real history, is cleverly written Text on Telugu Literature, without the dryness of the ordinary texts on the subject; for it is told in the form of a story. The style of the work is throughout chaste, terse and flowing.

* * * * * *

*25th Nov. 1912.* *The Hindu.*

# రాఁబోవు గ్రంథములు.

**చిత్రనాటకము**—మహారాజ్యనిర్మూలనమునకుఁ గారణమగు గొప్ప విప్లవమును దెల్పుచు గుండెలు ఝల్లుమనఁజేయసమర్థమగు నాటకము.

**పదినిపదారాయము**—250 ఏండ్లక్రిందట వ్రాయఁబడిన అముద్రిత మహాప్రబంధము ముక్కు తిమ్మన కవిత్వమువలె ముద్దులొలుకుచుండును.

**మనోవినాశనము**—స్వభావోన్మీలనము (Development of Character) గలిగి మనోహరమగు రాజపుత్రస్థాన విషయిక నవల

**విలాసాహసము**—నూతనకల్పనల విరాజిల్లు చక్కని నాటకము.

**విజయ**—ఇప్పటి దేశకాలవ్యవస్థను దెల్పు సాంఘికార్థికాది విషయములుగల నవల.

**అద్భుతోదయము**—నూతనమార్గముననుసరించి హృదయరంజకంబుగ వ్రాయఁబడిన ప్రబంధము.

**రాజభూషణము**—పేరెన్సప్రధానమై యెంతయోశ్రమతోడ కూర్చిన యదార్థవిషయములుగల నవల.

దేవరాజు వేంకటకృష్ణారావు,

సెక్రటరి.

మ॥ రా॥ రా॥ న్యాయపతి రామానుజస్వామి పంతులుగారు బి. ఏ. బి. ఎల్.
అధ్యక్షుఁడు.

మ॥ రా॥ రా॥ తాపి ధర్మారావు గారు, బి. ఏ.
సంపాదకుఁడు.

# "వేగుఁజుక్క" గ్రంథమాల.

బరంపురం, గంజాంజిల్లా.

## ప్రకటనల నొసంగువారికొక చిన్న విన్నపము.

1. మాగ్రంథమాలకు దినదినమును గ్రొత్తచందాదారు లసంఖ్యాకముగ వృద్ధియగుచున్నారు.

2. అన్నిపుస్తకములయందును శైలి సల్లలితమై, శయ్యా సరసమై, యంశము లతిరమణీయములై యుండుటచే ననేకులు మాపుస్తకములను బ్రేమించి చదువుచుందురు. భాషాభివృద్ధికి ముఖ్యాధారములై మాప్రచురములు తనరారుచున్నవి.

3. పెక్కండ్రు విఖ్యాతిగాంచిన కవిచంద్రులు మాగ్రంథమాలకు వారిపొత్తములు కానుకలుగా నొసంగుచున్నారు.

4. కావున ప్రకటనల నొసంగువారు వారిప్రకటనల మా ప్రచురములలోఁ బ్రచురింపించుకొనినచో మిక్కిలి లాభమును బొందఁగలరు.

5. ప్రకటనల రేట్లు ప్రస్తుతము పత్రికలయొక్కయు నితర గ్రంథమాలలయొక్కయు రేట్లకన్న మిక్కిలి తగ్గింపఁబడినందున **కారుచౌక** గానున్నవి.

6. ప్రచురణముల రేట్లు మొదలగువానిం గూర్చి * మాకు వ్రాసిన తెలిసికొననగును.

దేవరాజు వేంకటకృష్ణారావు, కార్యదర్శి,
"వేగుఁజుక్క" గ్రంథమాల, బరంపురం.

*M. R. Ry.*
**N. Ramanujaswamy Pantulu Garu, B.A., B.L.,**
*President.*

*M. R. Ry.*
**T. Dharma Rao Garu, B. A.**
*Editor.*

# "Vegujukka" Series.

*BERHAMPORE (Ganjam Dt.)*

Publishes Telugu Dramas, Novels ( Historical, Social and Economical,) Prabhandhams, Biographies and unpublished works of ancient authors of note, all of which are of great use to the Telugu world.

*Several authors of Solid worth are contributing their choice works to this Series.*

***Our motto is to publish books wherein are found:—***

1. **Descriptions of Nature.**
2. **Characterisation.**
3. **Development of Character.**
4. **Historical Beauties.**
5. **New Ideas.**

This is the best opportunity for advertisers to advertise themselves since every day sees fresh additions to the list of our Members.

For particulars apply to:—

D. V. KRISHNA ROW,
*Secretary,*
*BERHAMPORE.*

# ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురములు.

దేశాభ్యుదయమున కావశ్యకమగు విషయములందెల్ల బరిశ్రమజరుగుచున్న యీకాలమున భాషాభివృద్ధి కగ్రస్థాన మిచ్చుట ప్రధానమైయున్నది. సంఘముయొక్క సర్వావస్థలయందును, దేశముయొక్క అన్ని భాగములయందును, విజ్ఞానము ప్రసరింపఁజేయుటకు భాషాసేవయే ముఖ్యసాధనము. సనాతనాధునికేతిహాసములు ప్రకృతిశాస్త్రములు, అన్యదేశాదర్శనికగ్రంథములు, మహాపురుషులజీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, ఆర్థికశాస్త్రములు, వృత్తులును, పరిశ్రమలును, వాణిజ్యమును నడుపు విధమును దెల్పుగ్రంథములు, నవలలు, లేనిలోపమును ఆంధ్రభాషాభివర్ధనీసంఘము నివారింప బ్రయత్నించుచున్నది.

ఈకంపెనీ మూలధనము రు 10,000.

# భారతధర్మదర్శనము.

నిర్మలదేశానురాగమును బ్రబోధించుపద్యకావ్యము. సుప్రసిద్ధుండగు నొకయాధునికకవివరునిచే మృదుమధురముగ గానముచేయఁబడిన 109 పద్యములిందుగలవు. వెల రు 0-2-0 శాశ్వతచందాదారులకు రు 0-1 6 మాత్రమే.

ఈక్రిందిపద్యమునుబట్టి శైలియును, భావములును, గ్రహించనగును.

చ॥ మతములుపొచ్చిసిల్లు, జన మాన్యచరిత్రులు పుట్టినిల్లు, న
ప్రతిమ దయాశమాదిగుణ రత్నసమృద్ధికి రోహణాద్రి, శా
శ్వతనిగమాయ మోక్షఫల భాసురవల్లికి నాలవాలమై
యతులవిభూతిఁ బొల్చు విల నంబరో ! నీసరిధన్యు లుందురే ?

---

మేనేజరు:—ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం

# పీష్వానారాయణరావు వధ.

గ్రంథకర్త. వి. రామదాసుపంతులుగారు బి. ఎ. బి.యల్.
హైకోర్టువకీలు. ద్వితీయముద్రణము మూఁడుచిత్రపటములుగలవు.
వెల రు 0-2-0 చందాదారులకు రు 0-1-6.

# మహారాష్ట్ర చరిత్ర.

గ్రంథకర్త—చిల్లరిగె శ్రీనివాసరావు పంతులుగారు.

ఒకప్పుడు భరతఖండమున కాధారముగానుండిన మహారాష్ట్ర సామ్రాజ్యసంపాదకులైన శివాజీ మహారాజు మున్నగు వీరులచ్చరిత్రము విశేషమైన యీరాష్ట్రనిర్మాణముయొక్కయు, ప్రవర్తనముయొక్కయు, క్షీణదశయొక్కయు కారణములు సహేతుకములుగఁ జర్చింపఁబడియున్నవి. శైలి సుబోధకమై ప్రస్తుతము మనదేశీయచరిత్ర పాఠకార్థులైనవారి కీ మహారాష్ట్ర చరిత్ర సప్రమాణమైనదిగ నున్నది. మహారాష్ట్రనిర్మాణకర్తల దివ్యచరిత్రములే గాక, శివాజీ, శంభాజీ, రామదాసుస్వామి, అహల్యాబాయి, తారాబాయి, బాజీరావు, పీష్వానారాయణరావు మొదలగువారి 22 చిత్రపటములతోడను, భరతవర్షపు పెద్దపటముతోడను, అనేక కథావిశేషములతోడను, రాజనీతి విచారణలతోడను, యీగ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్యచదువరులకు రంజకముగను, విమర్శకులకు కావలసినంత చరిత్రసామగ్రియు నొందుపరుపఁబడియున్నవి. 500 పుటలు, ప్రశస్తమగు కాలికోబైండు వెల రు 1.14.0, చందాదారులకు రు 1.4.0.

మేనేజరు: —ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

# రామమోహనరాయల చారిత్రము.

గ్రంథకర్త:—కొణకంచి చక్రధరరావు పంతులుగారు.

నిర్మల బ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబుఁ గాంచి, అనాథలగు యువతులను బట్టి బలవంతముగ గాల్చివేయు సతియను భయంకరాచారంబునడంచి తనమాతృభూమియగు భరతఖండంబు నుద్ధరింప దత్పూర్వ మెన్నఁడు హిందువు లెవ్వరును వెళ్లుటకు సాహసించని ఖండాంతరమున కనేకమాసములు మహార్ణవముపై బయనమొనర్చి యచట మనకొఱ కనేక యుపన్యాసము లిచ్చి కార్యవిజయము గాంచువఱకు బట్టువిడువక తనదేశమాతకొఱకు పాటుపడుచుండిన మహాపురుషుని పూజ్యచారిత్రము. 200 పుటలగ్రంథము.

పటములతో వెల రు 0-12-0. చందాదారులకు రు 0-8-0.

# ఆరోగ్యశాస్త్రము

గ్రంథకర్త:—డాక్టరు, భో, పట్టాభిసీతారామయ్యగారు,

బి. ఏ. యం. బి. సి. యమ్.

ఈక్రిందిసూత్రములను గమనింపుడు !

(1) ఆరోగ్యమును గాపాడుటకు వ్యాధిచికిత్సకన్న వ్యాధి నివారణమే శ్రేష్ఠతరమగు పరమసాధనము.

(2) దేహము వ్యాధులకు లోనగుటకు రెండులోపము లుండవలెను.

(i) దేహదౌర్బల్యము.

(ii) వ్యాధికారణములగు సూక్ష్మజీవులను, విషకరపదార్థములను, స్వారోగ్యరక్షణ విధానమును, గృహారోగ్య నిర్మాణమును, జక్కఁగ గమనించిన దేహదార్ఢ్యమును నిలుపుకొనగలము.

(ii) సూక్ష్మజీవు లాహార జలవాయువులగుండ దేహములోనికి బ్రవేశించి సాంక్రామిక వ్యాధుల నుత్పన్నము సేయును.

ఆరోగ్యశాస్త్రమున నీయంశములన్నియును చర్చింపఁబడినవి.

మేనేజరు:—ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

# స్వాతంత్ర్యదర్శనము

గ్రంథకర్త.

దుగ్గిరాల, రామమూర్తిపంతులుగారు బి. ఏ. ఎల్. టి.

జాన్ స్టూ ఆర్టు మిల్లు అను ఆంగ్లేయపండితోత్తముని లిబర్టీ అను సుప్రసిద్ధ గ్రంథముయొక్క భాషాంతరీకరణము. మనోవాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము, స్వాతంత్ర్యపరిమితి మొదలగు సాంఘికశాస్త్రసిద్ధాంతము లీగ్రంథమునందు చరిత్రోపపత్తులతోడ విమర్శింపఁబడినవి. పాశ్చాత్యవాఙ్మయమునం దుత్కృష్టగ్రంథముగ పరిగణింపఁబడుచున్న యీగ్రంథము సుబోధకముగ తెనిఁగింపఁబడినది. కాలికోకవరు 175 పుటలు. రు 0-12-0, చందాదారులకు రు 0-7-0.

# ఆంగ్లేయరాజ్యాంగనిర్మాణచరిత్ర

గ్రంథకర్త.

మద్రాసు గవర్నమెంటు తెలుగుట్రాన్సులేటరుగారగు

గోటేటి కనకరాజు పంతులుగారు, బి. ఎ. బి. ఎల్.

ఇంగ్లాండుదేశముల రాజ్యపరిపాలన, నాగరికతయు, విపులముగ నిందు వర్ణింపబడి యున్నవి. ప్రాచీనవృత్తాంతము, విదేశరాజుల పరిపాలనము, స్వాతంత్ర్యనిర్ణయ మహాశాసనము, నిరంకుశ ప్రభుత్వమునకును పార్లమెంటునకు పోరాటము, ప్రజాప్రభుత్వము, అమెరికాయుద్ధము, శిల్పకళల ప్రాభవము, పార్లమెంటు సంస్కారము, విక్టోరియామహారాజ్ఞి, కాలనీలు, హిందూదేశము స్వారాజ్యము మొదలగు విషయములు గలిగి సుబోధకమై యున్నది. శైలి మృదుమధురముగను, వర్ణనలు మిగుల రసవంతముగను, కథానుక్రమణిక హృద్యముగను నుండి చరిత్రకథనము కావ్యములకంటె నుత్కృష్టముగ చేయబడినది. ఇందు 6 చిత్రపటములు 2 దేశపటములును గలవు. 300 పుటలు, ప్రశస్తమగు కాలికోబైండు వెల రు 1-4-0, చందాదారులకు వెల రు 0-12-6.

---

మేనేజరు;—ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

# అశోకచరిత్ర

ఇందు బౌద్ధధర్మవిజృంభణకాలమున హిందూదేశౌన్నత్యమును, అశోకుని రాజ్యవైభవమును, బౌద్ధధర్మవ్యాపకమును మిగుల రమణీయముగ నీగ్రంథమునందు వర్ణింపఁబడినవి. అనేకశాసనములును అక్కడక్కడ నక్కడి పద్యములును, 8 చిత్రపటములును, 1 అశోకుని రాజ్యమును దెలుపు హిందూదేశ పెద్దపటమును గలవు. పుస్తకమున క్యాలికోబైండు చేయఁబడినది. 330 పుటలు రు 1-4-0 చందాదారులకు రు 0-13-0.

# పునర్ముద్రణమందున్న గ్రంథములు

ఆక్బరు చరిత్ర. వివేకానందస్వామి జీవితము. సిక్కుల చరిత్ర. విద్యాసాగరుని చరిత్ర. రామమోహనరాయల చరిత్ర.

# ముద్రణమందున్న గ్రంథములు

జ్యోతిషశాస్త్రము. విద్యారణ్యులవారి చరిత్ర. ఆంగ్లరాజ్యతంత్రము.

# ముద్రింపబడవలసిన గ్రంథములు

ఆంధ్రచరిత్ర, అమెరికా చరిత్ర, జపాన్ చరిత్ర, మహారాష్ట్రచరిత్ర 2-వ భాగము, ఔరంగజీబు చరిత్ర మొదలగునవి.

N. B. మా శాశ్వత చందాదారులకు 100 పుటలు పోస్టేజిగాక రు 0-4-0 లు చొప్పున నిచ్చుచుందుము. రు0-4-0 ప్రవేశకట్నము చెల్లించవలయును. దరఖాస్తులు చేయువారు విశదముగ విలాసము వ్రాయవలయును. చందాదారులను చేర్చు యేజంట్లకు మంచికమీషన్ యీయఁబడును.

---

మేనేజరు :— ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము. (లిమిటెడ్) మచిలీపట్నం.

# ప్రభావతి (నవల)



గ్రంథకర్త:—గాదె జగన్నాథస్వామిగారు.

ఈనవల జగద్విఖ్యాతియశుడగు శివాజీమహారాజును గురించి వ్రాయబడినది. కథాచమత్కారమద్భుతము. భాష మృదుమధురము. ఈనవల నాంధ్రమహారాజనులనేకవిధముల గొనియాడియున్నారు. కాలికోబైండింగు చేయబడినది. చందాదారులకు 0-12-0 ఇతరులకు రు 1-4-0.

# పశుశాస్త్రము

గ్రంథకర్త:—శేనుమళ్ళ రాజగోపాలరాజుగారు, బి. ఎ.

ఇది కృష్ణాజిల్లా వ్యవసాయసంఘముయొక్క పుస్తకభాండాగారములోని పశువులకు సంబంధించి యనేకగ్రంథములనుండియు ఏలూరులో జరుపబడిన పశువ్యవసాయ ప్రదర్శనములకు వచ్చిన యనేకజాతుల పశువులవిషయమై స్వయముగా పరిశోధించి గుర్తించిన విషయవిమర్శనములనుండియు నితరవిధములయిన యనుభవములనుండియు నీగ్రంథము వ్రాయబడుటచే నిది యాంధ్రదేశీయుల కత్యంతోపయుక్తముగా నుండకమానదు. ఇందు పశువులరోగముల కౌషధములును, పశువృద్ధికిగావలసిన ప్రధానవిషయములును విపులముగా వ్రాయబడినవి. చందాదారులకు 0—5—0 ఇతరులకు 0—10—0

# చీనాదేశపుచరిత్ర

గ్రంథకర్త:—బేతపూడి లక్ష్మీకాంతరావుగారు.

ఇందు చీనాదేశముయొక్క పరిపాలన వారినాగరికత విపులముగా వర్ణింపబడియున్నది. ప్రస్తుతము చీనాదేశములో జరుగుచున్న యల్లకల్లోలము విపులముగా వ్రాయబడినది. ఇందు దేశభక్తాగ్రేసరుడగు సన్‌యాట్‌షేన్ మొదలగు దేశాభిమానుల చిత్రపటములు గలవు చందాదారులకు రు 0-13-0 యితరులకు రు 1-4-0.

మేనేజరు,

ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము (లిమిటెడ్,)

మచిలీపట్నం

Krishna Brothers.

Mangalavaram pet
**BERHAMPUR.**
(GANJAM.)

# విదళితాధికారి

(సుమారు 200 పేజీలుగల చిన్నచక్కని నవల.)

ఇందు ఒక రాజకుమారుఁడు తన తలిదండ్రుల లోపముచే నెటులనధికారహీనుఁడయ్యెనో, తనశత్రువుచేఁ బ్రేరితులైనవారి కపటోపదేశంబులకుఁ జెవియొగ్గి మోసపోయి, ఒకగొప్ప ఎడారింబడి ఎట్లుకటకటంబడెనో అప్పుడు దయామయుఁడగు పరమాత్ముఁడు తుపానురూపమున నడ్డుపడి యాతనిని రక్షించెనో ముందుగ బుద్ధిగరుప నరుదెంచిన కొన్ని దైవికంబులను తృణీకరించినవారి దురవస్థ లెట్లుండెనో సాధారణముగ దుష్టులగువారు అవసరకాలంబున నసహాయులయి ఉస్సూరని ఆశాభంగము నెట్లు కలుగఁజేయుదురో లోకంబున మేధానిధానులమని గర్వించి యుండువారు ఎట్టిగురాశపాలగుదురో మేలుకలుగఁజేయుటలో మంచికిని, చెడ్డకును నెంతహస్తిమశకాంతరమో సత్ప్రవర్తనలో నెంతమహాద్భుతశక్తికలదో అవియన్నియుఁ జక్కఁగ మనమున కంటునటుల వ్యక్తీకరింపఁబడియున్నవి.

గ్రంథము కావలయువారు సం॥ 1913 జనవరి 15 వ తేదీలోపల రెండణాల పోస్టేజీ స్టాంపులను మాకుఁ బంపి తమ పేరులను రిజిస్టరీ చేయించుకొనినయెడల మఱి (0-8-0) ఎనిమిదిఅణాలకుఁ బడయఁగలరు. ఇతరులకు పన్నెండుఅణాలకు (0.12.0) అమ్మఁబడును. పోస్టేజీ కొనువారే భరింపవలయును.

దేశిరాజు కృష్ణమూర్తి.
మేనేజరు.

—మారుతియొక్క మనుపగూంచ వరప్రసాదములు—

# మారుతాంజనము

మానవశరీరమునందే భాగమునందే కారణముచేనయిన గల్గునట్టినొప్పినైనను క్షణమాత్రములో నివారించునట్టి అద్భుతశక్తి, మిక్కిలి పరిమళము, ఘాటు, సుగుణములుగల లోకవిఖ్యాతమైన దివ్యౌషధము, తలనొప్పి, నడుము నొప్పి, రొమ్మునొప్పి, మోకాళ్లనొప్పి, బెణుకులు, తేలుబాధ, వాయుపోట్లు, మున్నగు సర్వవిధములైన నొప్పులు ఈయౌషధము వాడిన నిమిషకాలములో మాయమైపోవును. ప్రతియింటను నుండతగిన మందు. ఒకతూరి రాసిచూచిన గుణము తెలియును. వెల బుడ్డి 1 కి రు 0-8-0 మాత్రమే.

<u>మారుతిలవణము:</u>—అరుచి, అజీర్ణము, అగ్నిమాంద్యము, పులితేన్పులు, పిత్తవికారము, గుండెలలోమంట, కడుపుఉబ్బరము, విరేచనబద్ధము, కలరా మూలవ్యాధి, వాయుపుపోటు, మున్నగు ఘోరవ్యాధుల నివారించుటలో రామబాణమువంటి దివ్యౌషధము. ఈ యౌషధము వాడినదినమే దీని యద్భుతమహిమ తెలియును. శీఘ్రకాలములోనే శరీరమందారోగ్య మేర్పడును.

వెల బుడ్డి 1 కి రు 1-0-0 మాత్రం.

<u>సుగంధకేసరి:</u>—నిత్యస్నానాంతరములో శ్రేష్ఠమైన పరిమళగంధముచేసి వారలానందించుట కనుకూలపడునటుల తయారుచేయబడిన గంధరాజము. ఒకబుడ్డి సుగంధకేసరితో సుమారు 200 జనముచేరిన సభకు చాలునంత దివ్యమైనగంధము తయారుచేయవచ్చును. గంధముచేయుటకు పన్నీరు లేకనీళ్ళుతప్ప మరేమియు నక్కరలేదు. ఎంతవిలువగల అత్తరు అగ్గోజ మైసూరుగంధము వాడినను యింతసువాసన వుండదు. ఉత్సవకాలములయందు దీనిఉపయోగ మత్యావశ్యకము. వెల బుడ్డి 1 కి రు 1-0-0 మాత్రం.

తబిశీళ్ళుకోరువారికి క్యాటలాగు పంపెదము. ఏజంట్లుకావలెను.

యస్. వాసుదేవరావు, ప్రొప్రయిటరు. — మారుతి డిపో. (అనంతపురం జిల్లా.)

from begining to end, neither wearying us with detail nor withholding details where they would be expected. We congratulate our *Swami* on his gathering such best experience within the short compass of about 3 months."

United India and Native States:—" * * * * managed to see what is worth seeing and what is more important, he noted down all that was significant in what he saw. His observations of the men, manners and institutions of England are characterised by sanity and judgment."

The Indian Magazine and Review—" * * * In *My trip to England* the author declares his purpose to be merely descriptive avoiding 'partly from a sense of impropriety and irrelevancy' much comment of a personal nature; when, however, these scruples are occasionally weived aside, the 'moralisings' on scenes and events do much to relieve the narrative and show breadth of view and judgment. As a diary the book describes a typical 3 month's tour with details of every event from beginning to end.

The reader is carried through the glories of the Italian coast, the rich vineyards of France across, the Silver streak and on to the object of so many dreams, London. Here the various experiences of the sightseer are recounted ; side by side are set the grandeur and pomp of the Coronation festivities and the sad squalor of the East end, with the reflections thus aroused in a thoughtful mind. That such a visit is not only a source of pleasure, but serves a useful purpose, is seen from the omparison drawn between India and England. In his

devotion to his motherland, the writer never failed to observe her weakness by contrast, and it was with her welfare at heart that he gathered information. It is such patriots, starting out eager to learn and returning full of enthusiasm for the service of India, who honestly seek to bring out the good points of East and West.

The Mordern World:—* * * * * These experiences and notes of the writer are valuable as an interesting piece of narration and none the less as a piece of instruction for those who wish to take a trip to England."

PRICE ONE RUPEE ONLY, POSTAGE EXTRA.

For copies Apply to :—

THE AUTHOR,
Berhampore, Ganjam Dt.

# రాఁబోవు గ్రంథము

# ప్రేమము—**LOVE.**



ఉ॥ నవ్యకథానిధానమధునాతనసంస్కరణప్రధానమున్
స్తవ్యవచోవిధానమును, సారరసాదిక సంవిధానమున్
భవ్యతరాభిధానమయి భాసిలునాటకమున్ దృతీయమై
శ్రావ్యతనొందునట్లు ప్రచురమ్మొనరింతు మపూర్వఫక్కిగాన్.

ఇది యొకానొక వాస్తవవిషయము నాధారముగాఁ జేసికొని, యాంగ్లేయనాటక ఫక్కిననుసరించి, వ్రాయఁబడిన సవిషాదనాటిక.

ఇది నవరసపూరపూరితమయ్యును, ముఖ్యముగా శృంగార, హాస్య, కరుణారసంబులు మిక్కిలి చమత్కారముగా, నేర్పుగా నిందుఁ బోషింపఁబడినవి. సందర్భోచితప్రకృతివర్ణనములును, తత్తత్స్వభావనిరూపణోన్మీలనంబులు నెంతయో శ్రద్ధతో నిర్వర్తింపఁబడినవి. శైలిధారాళమై, యతిసుగమమై సర్వజనామోద సంధాయకమై యున్నది. ఇందలిశృంగారరసభాగములలో నసభ్యములగు పదములుగాని, వర్ణనములుగాని, మందునకైనఁగానరావు. ప్రేమముయొక్క పరిణామములు కొన్ని యిందు హృదయరంజకముగా వ్యక్తీకరింపఁబడినవి. ఇంతియే కాక అతిబాల్యవివాహము వలన నష్టములు, స్త్రీవిద్యవలని

లాభములును, వృద్ధవివాహములవలనివష్టములును, స్వయంవరము వలని లాభములును, ఇష్టదాంపత్యమువలని లాభములును, అతి మనోహరముగా వర్ణింపఁబడినవి. నాటికయగుట చేతను, పూర్ణనాటకములపద్ధతి ననుసరించి స్థలవిభజనము చేయఁబడి యుండుటచేతను, పరిదర్శనమునకు మిక్కిలియోగ్యమైయున్నది.

గ్రంథకర్త—అభినవాంధ్రకవితాపితామహులగు మండపాక పార్వతీశ్వరశాస్త్రిలవారికిఁ బౌత్రులును, పంచమజార్జి గ్రంథమాలా సంపాదకులును, పూర్ణాంధ్ర భాషావిశారదులును, నగు బ్ర॥శ్రీ॥ మండపాక-పార్వతీశ్వరశాస్త్రిగారు.

| | | |
|---|---|---|
| చందాదారులకు వెల | 0—6—0 | పోస్టేజికాక. |
| ఇతరులకు వెల | 0—12—0 | |

# విజ్ఞాపన.

మాయత్నము నంగీకరించి, మాగ్రంథములు ప్రచురించుట కవకాశ మొసంగిన యాంధ్రమహాజనులకు దోసిలియొగ్గి నమస్కరించుచున్నాము.

గ్రంథముల వెలలను మిక్కిలి తగ్గించితిమి.

మిక్కిలి యుపయోగకరములగు పొత్తముల రచియింపించుటకును, అట్టిరచనకుతోడ్పడుచు సద్గ్రంథములురచించుమహాకవులకెల్ల తగుమార్గముల బారితోషికముల నొసంగుటకును వలనుపడునటుల చేయుటకు మాకు శాశ్వతపుచందాదారులసంఖ్య హెచ్చుకావలెను. ఇందుకు మాప్రతిశాశ్వతపు చందాదారుని అధమము ఒక్కొక్కచందాదారునైన సమకూర్పఁ బ్రార్థించుచున్నాము. చందాదారులసంఖ్య వృద్ధియైనకొలఁది, ముద్రించుటకు నునుపైనదళసరికాగితముల నుపయోగించుటకు, చదువరుల కుత్సాహము కలుగుటకు సమయానుకూలమగు చిత్రపటములును కూర్చుటకును, చూచుటకందమగు క్యాలికో బైండింగును చేయించుటకును, సమర్థులమగుదుము. ఇటుల నన్నివిధముల నద్వితీయమగు సద్గ్రంథము లాంధ్రభాషలో నుండునటుల చేయువారు మాశాశ్వతపు చందాదారులేయని చాటిచెప్పగలము.

ఇట్లువిన్నవించు విధేయులు,

"వేగుఁజుక్క" గ్రంథమండలివారు.

1. న్యా॥ రామానుజస్వామి, బి.ఏ.బి.ఎల్., అధ్యక్షుఁడు.
2. తాపీ॥ ధర్మారావు బి.ఏ సంపాదకుఁడు.
3. దే॥ వేం॥ కృష్ణారావు, కార్యదర్శి.

బరంపురం, గంజాంజిల్లా.

